Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు    స్థాపితం: 1930    జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 82 • సంచిక: 21 • 27-5-2011 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-





# కాంగ్రెస్‌కొక నాయకుడు కావాలి!

కడప ఉప ఎన్నికల కలవరం నుంచి కాంగ్రెస్ పార్టీ బయట పడలేక పోతున్నది. అసలే నడిసముద్రం; ఆ పై చుక్కాని వంటి వైఎస్ రాజశేఖర్‌రెడ్డి ఉన్నట్లుండి అదృశ్యమై పోయాడు. పులిమీద పుట్రవలె జగన్ అనే పెను తుఫాను చుట్టుముడుతున్నది. దానితో నౌక అల్లకల్లోలమై పోతున్నది. క్రిందా మీదా పడుతున్నది. దాన్ని ఒడ్డుకు చేర్చేదెట్లో, చేర్చే వాడెవడో ఎవరికీ పాలు పోవడం లేదు. కాంగ్రెస్ పార్టీ మొత్తం, కార్యకర్తల నుంచి మంత్రుల వరకు, చివరకు ముఖ్యమంత్రి కూడా దారి తెన్ను తెలియని బాటసారి వలె నిలబడిపోయి వుంది. తాము అనాథలమై పోయామన్న భావన, ఆవేదన అందరిలోనూ వ్యక్తమౌతున్నాయి.

ఏదో ఒకటి చేయాలన్న తపనతో గులాంనబీ ఆజాద్ హైదరాబాదుకు వచ్చి రెండు రోజులపాటు తీవ్రస్థాయి కసరత్తు చేసి వెళ్లాడు. కానీ రెండున్నర వేల మంది నాయకులతో మాట్లాడిన తర్వాత ఆయన మనసు మరింత గందరగోళమై పోయింది తప్ప ఒక దారి తెన్ను కన్పించలేదు.

కాంగ్రెస్ పార్టీని ఇప్పుడు ప్రధానంగా వేధిస్తున్న ప్రశ్న – నాయకుడు ఎవడు అన్నదే. మూడేళ్లపాటు జగన్ తాకిడి నుంచి తెలంగాణ ఉద్యమం నుంచి, ముఖ్యమంత్రి వైఫల్యాల నుంచి, ప్రభుత్వం తప్పిదాల నుంచి పార్టీని కాపాడి, కార్యకర్తలలో, ప్రజలలో పార్టీ పట్ల విశ్వాసం కల్గించే మొనగాడు ఎవడు అన్నది కొరుకుడు పడని ప్రశ్న. అంతమాత్రం మీస మున్నవాడు కాగడా పెట్టి వెతికినా కన్పించడం లేదు. పార్లమెంటు సభ్యులుంటే ఢిల్లీలో పైరవీలు చేసుకోవడంలో తలమునకలుగా వున్నారు. దాదాపు ప్రతి కాంగ్రెస్ ఎమ్పీకి ఏదో ఒక వ్యాపారం వుంది. వాటి పనుల మీద కేంద్ర మంత్రులను, అధికారులను మచ్చిక చేసుకోవడం కోసం వారు తమ ఎమ్పీ పదవి వాడుతున్నారు. ఎమ్మెల్యేలను చూస్తే తీవ్ర నిరాశ నిస్పృహలతో వేగి పోతున్నారు. వైఎస్ రాజశేఖర్‌రెడ్డి ఉన్నంత కాలం వారు ఏది అడిగితే అది దోచిపెట్టాడు. స్వంత పనైనా, నియోజక వర్గం పని అయినా కాదనకుండా చేశాడు. కానీ కిరణ్‌కుమార్

కొరవ 14వ పేజీలో



## టెన్త్ పరీక్షల్లో

# రత్నం విద్యార్థి స్టేట్ టాపర్!



టెన్త్ పరీక్షల్లో స్టేట్ టాపర్ వెంకటసాయిని అభినందిస్తున్న నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి. ప్రక్కన రత్నం విద్యాసంస్థల డైరక్టర్ కె.వేణుగోపాల్.

రాష్ట్రంలో మొట్టమొదటి కోచింగ్ సెంటర్, కార్పొరేట్ జూనియర్ కాలేజి ప్రారంభించిన ఘనత కెవి.రత్నంగారిది. రత్నం సార్‌లో అపారశక్తి, క్రియాశీలతలు మెండు. అందువల్ల తాను ముందుకు నడవడమేగాక వేలాది మంది డాక్టర్లు, ఇంజనీర్లను రత్నం విద్యాసంస్థల ద్వారా దేశానికి అందిస్తూనే వున్నారు.

## మార్పుకు శ్రీకారం రత్నం హైస్కూల్!

జ్ఞానం ఒక నిక్షేపం వంటిది. అభ్యసనం ద్వారానే దాన్ని సాధించగలుగుతామని రత్నం విద్యాసంస్థల విశ్వాసం. అందుకే మాధ్యమిక విద్యాబోధనలో విప్లవాత్మకమైన మార్పులకు శ్రీకారం చుడుతూ రత్నం హైస్కూళ్లను స్థాపించారు.

## రికార్డు బద్దలు చేసిన వెంకటసాయి

విద్యార్థులలోని ప్రతిభ, ప్రావీణ్యం, మేధస్సుకు పదును పెట్టేలా సాగిన విద్యాబోధనతోనే రత్నం హైస్కూల్‌లో చదివిన సామాన్య విద్యార్థి పి.వెంకటసాయి టెన్త్ పరీక్షా ఫలితాల్లో 595 మార్కులు సాధించి ఎస్ఎస్‌సి బోర్డులో ఇప్పటి వరకున్న రికార్డులను బద్దలు చేశాడు. స్టేట్ ఫస్ట్ ర్యాంకర్‌గా నిలిచాడు.

## ఎందరో ర్యాంకర్లు!

వెంకటసాయి ఫలితంతోనే రత్నం ఫలితాల ప్రభంజనం ఆగలేదు. 590 మార్కులతో మరో విద్యార్థి అబ్దుల్ గఫూర్ రాష్ట్ర స్థాయిలో 5వ ర్యాంకు స్వంతం చేసుకొన్నాడు. పిడతాపోలూరు బ్రాంచిలో చదివిన వి.వినయ్ చౌదరికి 584 మార్కులు వచ్చాయి.

## రత్నాల కార్ఖానా 'రత్నం హైస్కూల్'

మామూలు విద్యార్థులను కూడా చదువులలో రత్నాలను చేయడం రత్నం విద్యాసంస్థల ప్రత్యేకతని చెప్పాల్సిన అవసరం లేదనుకొంటాం.

# భూమికి భూమే ఇవ్వాలి!

పారిశ్రామిక అవసరాల కోసం రైతుల భూమిని సేకరించడానికి ప్రభుత్వాలు చేస్తున్న కుటిల ప్రయత్నాలకు అడ్డుకట్ట పడక పోవడం విచారకరం. ప్రజల ప్రయోజనాల కోసం ఎవరి నుంచైనా భూమిని సేకరించే అధికారం ప్రభుత్వానికి వుంది. అయితే ప్రజా ప్రయోజనం అనే పదానికి ప్రభుత్వ నేతలు తమ చిత్తం వచ్చిన నిర్వచనాలు ఇవ్వడం వల్లనే రైతాంగానికి అన్యాయం జరుగుతున్నది.. నీటిపారుదల ప్రాజెక్టులు, ప్రభుత్వ భవనాలు, సైనిక కేంద్రాలు వంటి వాటి కోసం ఎప్పుడో 1894లో తెల్ల దొరలు చేసిన చట్టమది. దాన్ని ఇప్పటి నల్ల దొరలు తమ స్వార్థం కోసం చిత్తం వచ్చిన రీతిలో దుర్వినియోగం చేస్తున్నారు. పారిశ్రామికులతో లాలూచీ పడి, వారి భూదాహానికి వంత పాడుతున్నారు. అంతరించిపోయిన జమీందారులకు మళ్లీ ప్రాణ ప్రతిష్ట చేస్తున్నారు.

భూమి లేకుండా పరిశ్రమ పెట్టడం ఎట్లా అన్నది ప్రభుత్వ పెద్దలు తరచు వేసే ప్రశ్న. కానీ ఎవరో పరిశ్రమ పెట్టడానికి పేద రైతు తన జీవనాధారం ఎందుకు కోల్పోవాలన్న సహజ న్యాయ సూత్రాన్ని విస్మరిస్తున్నారు వీరు. పరిశ్రమ అనేది వాణిజ్యపరమైన కార్యక్రమం. వాణిజ్య అవసరాల కోసం భూమిని కొనదలచినపుడు, ఆయా పారిశ్రామికులు రైతుకు సరైన ధర చెల్లించడం తప్పనిసరి. వారు నేరుగా రైతుల వద్దకు వెళ్తే, జరిగేది అదే. కానీ ఇక్కడ ప్రభుత్వం అనవసర జోక్యం చేసుకొని, పారిశ్రామికవేత్తలకు లాభం చేకూర్చడం కోసం రైతులకు అన్యాయం చేస్తున్నది. ప్రభుత్వ అండ చూసుకొని పారిశ్రామిక వేత్తలు తమ అవసరాలకు మించిన భూమిని దుర్మార్గంగా స్వంతం చేసుకొంటున్నారు.

వ్యవసాయం చేసే భూములను పరిశ్రమల అవసరాల కోసం సేకరించకూడదని, ఒకవేళ అది తప్పనిసరి అయితే అందుకు తగిన పరిహారం చెల్లించాలని ఎన్నో ఏళ్లుగా రైతాంగ సంస్థలు కోరుతున్నాయి. కాంగ్రెస్ అధినేత్రి సోనియాగాంధీ కూడా ఆ వాదనతో ఏకీభవిస్తున్నారు. ఆమె తనయుడు, కాంగ్రెస్ భావి నేత రాహుల్ గాంధీ రైతుల పక్షంగా వీధి పోరాటానికి సిద్ధపడుతున్నాడు. కానీ విచిత్రంగా వారి నేతృత్వంలోని కాంగ్రెస్ పాలిత రాష్ట్ర ప్రభుత్వాలు మాత్రం రైతుల పొట్ట కొట్టి మరీ పారిశ్రామికుల భూదాహం తీరుస్తున్నాయి. పశ్చిమబెంగాల్‌లోని సింగూరులో ప్రజా అభిమతానికి విరుద్ధంగా టాటా సంస్థకు భూమి కట్టబెట్టడానికి చేసిన ప్రయత్నానికి కమ్యూనిస్టులు 34 ఏళ్ల అధికారాన్ని త్యాగం చేయవలసి వచ్చింది.

ఈ నేపథ్యంలో సుప్రీంకోర్టు భూసేకరణకు సంబంధించి కేంద్ర ప్రభుత్వానికి స్పష్టమైన ఆదేశం ఇవ్వడం సంతోషించదగిన విషయం. తమకు రావలసిన న్యాయమైన పరిహారం కోసం రైతులు కోర్టుల చుట్టూ తిరగవలసి రావడం విచారకరమని, ఆ పరిస్థితి తలెత్తకుండా రైతులు పూర్తి ఇష్టంతో తమ భూమిని అప్ప చెప్పే స్థాయిలో పరిహారం చెల్లించడానికి ప్రభుత్వం ప్రయత్నం చేయాలని ఆదేశించింది సర్వోన్నత న్యాయస్థానం.

భూసేకరణ పేరుతో ఎంతో కొంత మొత్తం చేతిలో పెట్టడం వల్ల రైతు చాలా విధాల నష్టపోతున్నాడు. పరిశ్రమల కోసం భూసేకరణ జరిగిన వెంటనే ఆ ప్రాంతంలో భూముల విలువలు అమాంతం పెరిగిపోతున్నాయి. భూమిని వదులుకొన్న రైతు తిరిగి భూమి కొనడం దాదాపు అసాధ్యమై పోతున్నది. దానితో తనకు తెలిసిన వ్యాపకాన్ని వదలి, ఇతర కార్యక్రమాలకు వెళ్లక తప్పడం లేదు. ఆ రంగంలో అనుభవం లేకపోవడం వల్ల రైతు చేతికి వచ్చిన డబ్బు నష్టపోయి, కూలీగా మారి పోతున్నాడు. జీవనాధారం కోల్పోతున్నాడు. ఆ రైతుల జీవితాలు ఎంత దారుణంగా దెబ్బ తిని పోతున్నాయో ప్రభుత్వాలు పట్టించుకోవడం లేదు.

జమీన్‌రైతు

ఈ సమస్యకు పరిష్కారం, పరిశ్రమలు, ఎస్ఇజడ్‌ల వంటి వాణిజ్య అవసరాల కోసం భూమిని సేకరించేటప్పుడు వాణిజ్య స్థాయిలోనే పరిహారం చెల్లించడం లేదా భూమికి బదులుగా భూమిని ఇవ్వడం లేదా రైతు ఇతర వ్యాపకాలలో స్థిరపడే వరకు కనీసం ముప్పై ఏళ్లపాటు ఆ భూమికి మక్తా చెల్లించడం జరగాలి. అది కూడా పూర్తిగా రైతు సమ్మతితోనే జరపాలి. రైతు అభిమతానికి విరుద్ధంగా భూసేకరణ జరపడానికి లేదనే చట్టం తెస్తే తప్ప ఈ దుష్ట సాంప్రదాయానికి తెర పడదు.

## జనవాణి

### జన చైతన్యానికి ప్రతీక

ఇటీవల దేశంలో జరిగిన ఐదు రాష్ట్రాల శాసనసభ ఎన్నికల గూర్చి ఎవరు ఎన్ని వ్యాఖ్యానాలు చేసినా ఫలితాలు జనచైతన్యానికి ప్రతీకగా నిలిచాయి. పశ్చిమ బెంగాల్‌లో సిపిఎం పార్టీ కోటలు బద్దలు చేసిన సముజ్వల విజయ స్వరూపం మమతా బెనర్జీ గూర్చి చెప్పుకోవాలి. ఈ విజయం కోసం ఏళ్ల తరబడి ఎంతోగానో శ్రమించారామె. తమిళనాడులో కరుణానిధి కుటుంబం చేసిన తప్పులు జయలలితను ముఖ్యమంత్రిని చేశాయి. కేరళలో మంచి మనిషి ఉమన్‌చాంది నేతృత్వంలో ప్రభుత్వం ఏర్పడడం శుభసూచికం. అసోంలో మాత్రం కాంగ్రెస్ ముఖ్యమంత్రి తరుణ్ గగోయ్‌ను ప్రతిపక్షాలు ఏం చేయలేక పోయాయి. పుదుచ్చేరిలో కూడా రంగస్వామి విజేతగా నిలవడం మార్పుకు సంకేతం. ఈ ఎన్నికలు దిగజారిపోతున్న కాంగ్రెస్ ప్రభకు సంకేతంగా నిలిచాయి. కాంగ్రెస్ అధిష్టానంలో మార్పు రాకుంటే వచ్చే పార్లమెంట్ ఎన్నికలలో ఆ పార్టీ భారీ మూల్యం చెల్లించక తప్పదు.

ఎం.సుధీర్ నెల్లూరు

### బిజెపి నేతలకు ఇదేం పిచ్చి?

నూరు మంది సాధువులలో 80మంది నడత సరిగ్గా వుండదు. కాషాయం వేస్తే చాలు సుఖంగా గడపడానికి బోలెడు వసతులు దొరుకుతాయి. ఈ కోవకు చెందిన స్వామినే జిల్లా సరిహద్దు చేవూరులో ఆశ్రమం ఏర్పాటు చేసుకొన్న రామదూత స్వామి. ఇతను సామాన్యుడు, అవిద్యావరుడు, భూ ఆక్రమణదారుడు. ఇటువంటి స్వామిపై బిజెపి అగ్రనేతలంతా ఒక్కసారిగా భక్తి విశ్వాసాలను పెంచుకున్నారు. మురళీ మనోహర్‌జోషి, నితిన్ గడ్కరీ వంటి అగ్రనేతలు చేవూరు తరలివెళ్లి రామదూత స్వామికాళ్లకు నమస్కరించడం చూసేవాళ్లకు ఎబ్బెట్టుగా అనిపించింది. ఇటువంటి స్వాముల గుట్టును నిఘా వర్గాలు వెల్లడి చేయాల్సిన అవసరం ఎంతైనా వుంది.

వాస్తు రామచంద్ర నెల్లూరు

### నల్లడబ్బును వెలికితీయాలి!

ఇటీవల జరిగిన కడప ఉప ఎన్నికల్లో ఓటరును ప్రభావితం చేసేందుకు, తమవైపు తిప్పుకొనేందుకు వైఎస్ఆర్ కాంగ్రెస్, తెలుగుదేశం, కాంగ్రెస్ పార్టీలు రాజీలేని పోటీతత్వంలో కోట్లాది రూపాయలు నడివీధుల్లో ప్రవహింపచేశాయి. కోట్లాది రూపాయల డబ్బును పోలీసులు పట్టుకొన్నారు. దేశంలో వేలకోట్ల రూపాయల నల్ల ధనం వేల మంది దగ్గర మూల్గుతుంది. దీన్ని వెలికి తీసి దేశాభివృద్ధికి వినియోగించే చర్యలు చేపట్టమనవి.

పి.అరుణ కుమారి నెల్లూరు

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

30-5-1941
పేజీలు : 10 వెల: అణా

### నెల్లూరు ముచ్చట్లు

### ఈ రెడ్డి యువతి ఎవరు?

నెల్లూరు రెడ్డి యువతి ఒకామె చిత్తచాంచల్యంతో చీరాల ప్రాంతంలో తిరుగుతున్నదట. ఆ మాటల ధోరణిలో ముత్తుకూరు, మైపాడు, బుచ్చిరెడ్డిపాళెం మొదలగు గ్రామాల పేర్లు చెప్పుచున్నదట. ఆమె బంధువర్గం గమనించాలె. ఆమె అడ్రసు కావలిస్తే 'జమీన్‌రైతు' పత్రికవార్ని కనుక్కుంటే తెలుస్తుంది.

### వసంతరావును కొట్టుట

కత్తుల వసంతరావు అనే అతను రాత్రులు పొద్దుపోయిన తర్వాత వీధుల్లో తిరిగి ఫలహారాలమ్ము కొంటుంటాడు. 28వ తేది జెండావీధికి పోగా ఒక మహమ్మదీయుడు ఫలహారాలు అప్పివ్వమని అడిగాడని, పాత బాకీయిస్తే ఇస్తానన్నాడని, అందుమీదట అతను, మరికొంత మంది మహమ్మదీయులు ఇతన్ని విశేషంగా కొట్టారని వసంతరావు పోలీసు రిపోర్టు చేశాడు.

మహమ్మదీయ పెద్దలు ఇలాంటి దుండగీండ్రను మందలించడం అవసరం. ఉదాసీనం వహిస్తే ఇలాంటివే హిందూ – మహమ్మదీయ కలహాల కింద మారుతవి.

### గూడూరు గొడవలు

పంచాయితీ బోర్డు మొదట సత్యానందం గారి సభ్యత్వమును ప్రెసిడెంటు గారు రద్దు చేసిరి. అది కోర్టులో వున్నది. తిరుగా కొండ్రెడ్డి పిచ్చిరెడ్డి, వెంకటసుబ్బయ్య శెట్టి వీరిద్దరూ తమ ఇండ్ల పన్నులు సకాలంలో కట్టనందున వీరి సభ్యత్వమును కూడా రద్దుచేసిరి. ఇట్లే తన పార్టీ వారు బాకీవున్నా వారి మీద చర్య బుచ్చుకోలేదు.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

26-5-1961
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### నెల్లూరు ముచ్చట్లు

### నెల్లూరులో కాంగ్రెస్ అధ్యక్షుని కార్యక్రమం

అఖిల భారత కాంగ్రెస్ అధ్యక్షుడు నీలం సంజీవరెడ్డి జూన్ 14వ తేది ఉదయం ఒంగోలులో దిగి కావలి మీదుగా మధ్యాహ్నం భోజనానికి నెల్లూరు చేరెదరు. ఆ రోజు మధ్యాహ్నం మూడు గంటలకు కాంగ్రెస్ వర్కర్ల సభ; సాయంత్రం ఆరు గంటలకు కాలేజి మైదానంలో బహిరంగ సభ వుంటవి.

### డాక్టరు గోపాలరెడ్డి

ప్రస్తుతం జిల్లాలో పర్యటిస్తున్న కేంద్ర గృహ నిర్మాణ సరఫరా శాఖామాత్యులు డాక్టరు బెజవాడ గోపాలరెడ్డి గారు 29వ తేది రాత్రి 7.44 గంటలకు డీలెక్సు ఎక్స్‌ప్రెస్‌లో బయలుదేరి ఢిల్లీ పోయెదరు.

### కావలి మునిసిపాలిటీ

కావలిని జూన్ 1వ తేది నుండి మునిసిపాలిటీ చేస్తూ ప్రభుత్వం ప్రకటన చేసింది. ఈ మునిసిపాలిటీలో కావలి పట్టణంగాక సర్వాయపాళెం, ఆముదాలదిన్నె పంచాయితీల గ్రామాలు చేరి వుంటవి. కానీ పై రెండు పంచాయితీల అధ్యక్షులు కావలిని మునిసిపాలిటీగా మారుస్తూ ప్రభుత్వం చేసిన ఉత్తర్వును నిలుపుదలజేస్తూ ఉత్తర్వు నివ్వవలసిందిగా హైకోర్టులో రిట్ పిటిషన్ దాఖలుచేసి, తాత్కాలిక ఉత్తర్వు పొందారు. కావలికి దగ్గర వున్న గ్రామాలను వదలి దూరమున వున్న తమ గ్రామాలను కలిపారని; పంచాయితీ సమితిలో తమ బలాన్ని పెంచుకొనుటకు ప్రభుత్వం ఈ పనిజేసిందని; తమ గ్రామాలను కావలిలో కలిపే ముందు తమతో సంప్రదించలేదని వగైరా ఆక్షేపణలను రిట్ పిటిషన్‌లో తెలియజేశారు. హైకోర్టు ఉత్తర్వు వల్ల జూన్ 1వ తేది కావలి మునిసిపాలిటీగావడం నిలిచి పోయింది.

# నెల్లూరు ముచ్చట్లు

## సిపిఐకి రామరాజు రాజీనామా

సిపిఐ జిల్లా కార్యవర్గ సభ్యుడు, ఎఐటియూసి జిల్లా అధ్యక్షుడు కూడా అయిన వి.రామరాజు ఆ పార్టీకి రాజీనామా చేశారు. ప్రత్యేక తెలంగాణకు పార్టీ మద్దతు ప్రకటించిన విషయాన్ని నిరసిస్తూ ఈ రాజీనామా చేసినట్లు తెలిసింది. విశాలాంధ్ర అనేది పార్టీ నినాదమైతే నాయకులు ప్రత్యేక తెలంగాణకు ఎలా జైకొడతారని రామరాజు ప్రశ్న. జిల్లా సిపిఐ పార్టీలో పదిమంది కార్యకర్తల వెంటేసుకొని ఈ పని ఆపని చేసే నాయకుడు రామరాజు. ఆయన రాజీనామా లేఖ చేతికి అందగానే నెల్లూరులోనే వుండిన సిపిఐ రాష్ట్ర కార్యదర్శి నారాయణ ఆయన ఇంటికి వెళ్లి సర్ది చెప్పినట్లు తెలిసింది.

నగరంలో సిపిఐ కొత్త పార్టీ ఆఫీసును కట్టారేగాని కార్యకర్తలకు పార్టీ నాయకులు అందుబాటులో వుండడం లేదు. ఎంతో మక్కువతో పార్టీలో చేరిన మార్కెట్ నాగేశ్వరరావు అనారోగ్యం కారణంతో ఆఫీసుకు రావడం లేదు. దశరథ రామయ్య తన వ్యాపారాలలో తాను బిజీగా వుండడం వల్ల జిల్లా పార్టీ కార్యాలయం దిక్కులేనిదిగా తయారయ్యిందని కార్యకర్తలు వాపోతున్నారు.

## దొంగల అరెస్ట్!

నెల్లూరు నగరంలో తాళాలు వేసి వుండే ఇళ్లలో ఒక పథకం ప్రకారం దొంగతనాలు చేస్తుండిన బావ, బావ మరుదులు అక్బర్, షఫీలను క్రైం పోలీసులు అరెస్ట్ చేశారు. వీరి వద్ద నుంచి 12 లక్షల విలువైన 72 సవర్ల బంగారు వస్తువులను స్వాధీనం చేసుకొన్నట్లు 19తేదీ ఎస్పీ దామోదర్ విలేకరుల సమావేశంలో వెల్లడించారు. వీరిద్దరు కలసి నగరంలో 14 ఇళ్లలో చోరీలు చేసినట్లు వివరించారు. వీరిని అరెస్ట్ చేసిన క్రైం పోలీస్ స్టేషన్ సిఐలు బాజీజాన్ సైదా, శ్రీనివాసన్, కానిస్టేబుళ్లు తిరుపతయ్య, సుధాకర్, హరీష్‌రెడ్డి, శివకృష్ణ, వేణు, శరత్, భాస్కర్, గిరి, పోలయ్య, వెంకటేశ్వర్లు, ఇలియాజ్, మస్తాన్, శివ, ప్రసాదులను ఎస్పీ అభినందించారు.

## జాతీయ రహదారి దిగ్బంధం

రైతులు పండించిన ధాన్యానికి గిట్టుబాటు ధరనివ్వాలని కోరుతూ తెలుగుదేశంపార్టీ నేతృత్వంలో బుజబుజ నెల్లూరు జంక్షన్‌లో జాతీయ రహదారిని అరగంటపాటు దిగ్బంధం చేశారు. ఈ సందర్భంగా పార్టీ శ్రేణులను వుద్దేశించి తెలుగుదేశం పార్టీ జిల్లా అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి మాట్లాడుతూ రాష్ట్రంలో ధాన్యాన్ని మద్దతు ధర చెల్లించి కొనలేని సిఎం, పార్లమెంట్ సభ్యులను వెంట బెట్టుకొని ఢిల్లీ వెళ్తాననడం విడ్డూరంగా వుందన్నారు. పొరుగు రాష్ట్రాలైన తమిళనాడు, కేరళలోని ప్రభుత్వాలు క్వింటాల్ ధాన్యాన్ని 200 రూపాయలు ఎక్కువ మద్దతు ధర ఇస్తూ కొంటున్న విషయం కూడ సిఎంకు తెలియక పోవడం బాధాకరమన్నారు. ఈ దిగ్బంధంలో తెలుగుదేశం పార్టీ నాయకులు తాళ్లపాక రమేష్‌రెడ్డి, కిలారి వెంకట స్వామినాయుడు, చేజర్ల వెంకటేశ్వర్లు, నూనె మల్లిఖార్జునయాదవ్, సంపత్ రాజు, బాబిరెడ్డి తదితరులు పాల్గొన్నారు.

## కలెక్టర్‌ను ప్రశ్నించిన రైతులు!

జిల్లా కలెక్టర్ బి.శ్రీధర్‌రెడ్డికి నెల్లూరు రైతుల చైతన్యాన్ని ప్రత్యక్షంగా చూసే అవకాశం దక్కింది. రైతు చైతన్య యాత్రల్లో భాగంగా నార్తురాజుపాళెంలో నిర్వహించిన సదస్సులో రైతులు కలెక్టర్‌ను ప్రశ్నలతో వుక్కిరిబిక్కిరి చేశారు. చైతన్య యాత్రలు వద్దు. పంటలు ఎలా సాగు చేయాలో మాకు తెలుసు. మీరు మద్దతు ధర ఇప్పిస్తే చాలన్నారు. రైతుల ఆవేదనను అర్థం చేసుకొన్న కలెక్టర్ మద్దతు ధర ఇప్పించేందుకు తనవంతు ప్రయత్నం చేస్తానన్నారు. ధాన్యం కొనుగోలు కేంద్రాలు పెద్ద సంఖ్యలో తెరుస్తామని, మిల్లర్లతో మద్దతు ధర ఇప్పించేలా ఒక సమావేశం కూడా ఏర్పాటు చేస్తానని రైతులకు సర్ది చెప్పారాయన.

## సిఐ వీరంగం

గతంలో వన్‌టౌన్ ఎస్ఐగా పని చేసి ఇటీవలే పదోన్నతిపై సిఐ అయిన మంగారావుకు ఏ పురుగు తొలిచిందో ఏమో ధనలక్ష్మీపురంలోని మద్యంషాపులో ఫుల్‌గా మద్యం సేవించి రోడ్డుపై నిలబడి వీరంగం చేశారు. దారినపోయే మహిళల పట్ల అనుచితంగా ప్రవర్తించడంతో స్థానికులు కలగజేసుకొని దేహశుద్ధి చేశారు. సమాచారం అందుకొన్న రూరల్ పోలీసులు సంఘటనా స్థలాన్ని చేరి మంగారావును అదుపులోనికి తీసుకోకుండా ఇంటికి పంపడం విమర్శకు దారి తీసింది.

**చందాదారులకు మనవి**

- **చందా పంపించేటప్పుడు తమ చందా నెంబరు, పూర్తి పేరు, చిరునామా తెలియపరచండి.**
- **మీ చందా నెంబరు, చందా ఏ తేదికి అయిపోతుందో, అడ్రసు రేపరు మీదనే ముద్రించి వుంటుంది.**
- **'జమీన్‌రైతు' చందాదార్లు తమ చందాను ఎం.ఓ/డి.డి లేదా Onlineలో ఆంధ్రాబ్యాంక్, విఆర్‌కాలేజ బ్రాంచి, నెల్లూరు అకౌంట్ నెంబర్: 106811011000423లో ZAMINRYOT పేరుతో జమచేయవచ్చు. సకాలంలో చందా చెల్లించవలసినదిగా కోరుతున్నాము.**
- **చెక్కులు స్వీకరించబడవు.**

**జీవిత చందా రూ.1000/-**

**సంవత్సర చందా**

స్వదేశంలో రూ.200/-
విదేశాలకు రూ.1000/-

**జమీన్‌రైతు**
**పొగతోట, నెల్లూరు - 524 001**
**ఫోన్: 0861 - 2327354**
**సెల్: 98489 66190**

## వెంకటగిరి చీరలకు పేటెంట్ హక్కు!

వెంకటగిరి చీరలకు మరింత ప్రాముఖ్యం లభించింది. జాతీయ ఉత్పత్తులలో వెంకటగిరి చీరలకు 18వ స్థానం కల్పించారు. అంటే పేటెంట్ హక్కు ఇచ్చినట్లు లెక్క. వెంకటగిరి జరీచీరకు 150 ఏళ్ల చరిత్ర వుంది. 26వేల మంది చేనేత కార్మికులు ఈ పరిశ్రమపై ఆధారపడి బతుకుతున్నారు. ఏడాదికి 40కోట్ల రూపాయల వ్యాపార లావాదేవీలు జరుగుతున్నాయి.



**ఏడుకొండల స్వామి జన్మ నక్షత్రమైన శ్రవణ నక్షత్రాన్ని పురస్కరించుకొని టిటిడి కళ్యాణ మండపంలో జరిగిన శ్రీనివాస కళ్యాణంలో ఉభయకర్త చెరుకుపల్లి తిరుపాల్‌రెడ్డి, జంట ఎమ్మెల్యేలు ఆనం వివేకానందరెడ్డి, ముంగమూరు శ్రీధరకృష్ణారెడ్డి, బివి.నరసింహం, వాకాటి విజయకుమార్‌రెడ్డి.**

## డాక్టర్ శ్రీనివాసరాజు సాయం!

నెల్లూరులోని బొల్లినేని సూపర్ స్పెషాలిటి వైద్యశాలలో గుండె డాక్టర్ సి.ఎస్.శ్రీనివాసరాజు దంపతులు హెల్పింగ్ హ్యాండ్స్ సంస్థ నెలనెలా పేదలకు ఇస్తున్న పెన్షన్లకుగాను 36వేల రూపాయలు విరాళంగా అందించారు.

## వార్తల్లో జూబ్లీ ఆసుపత్రి!

బాలింత మరణంతో నెల్లూరు జూబ్లీ ఆసుపత్రి మరోసారి వార్తల్లో నిలచింది. కలువాయి మండలం చింతలాత్మకూరు గ్రామానికి చెందిన తిరుపతమ్మ కాన్పు కోసం ఈ ఆసుపత్రిలో చేరింది. 18తేదీ పెద్దాపరేషన్ చేసి మగబిడ్డను బయటకుతీశారు. 20తేదీ తీవ్ర రక్తస్రావం కావడంతో నారాయణ హాస్పిటల్‌కు పంపారు. ఆమె అక్కడ చనిపోవడంతో జూబ్లీ హాస్పిటల్‌లో సరైన చికిత్స అందక మరణించిందని బంధువులు ఆసుపత్రి వద్ద పెద్ద గందరగోళమే చేశారు. పెద్దాసుపత్రుల సమన్వయకర్త డాక్టర్ నిర్మలమ్మ, నాల్గవపట్టణ ఎస్ఐ దశరథరామయ్య ఆందోళనకారులను సముదాయిస్తుంటే ఆసుపత్రి సూపరింటెండెంట్ సీతామహాలక్ష్మి మాత్రం తమ తప్పేమీ లేదని చెప్పి గొడవ ఇంకాస్త పెరిగేట్లు చేశారు. అయినా జూబ్లీ ఆసుపత్రిలో వృత్తిపట్ల నిబద్ధత, జాలి, దయగల వైద్య సిబ్బంది తక్కువే.

## డాక్టర్ వేణుగోపాల్‌రెడ్డికి పురస్కారం

నెల్లూరీయుడు కడపలో స్థిరపడ్డ డాక్టర్ మల్లెమాల వేణుగోపాలరెడ్డిని మచిలీపట్నంలోని ఆంధ్ర సారస్వత సమితి రచన, వైద్యం, సామాజిక సేవలకు గుర్తింపుగా మే 8తేదీ సన్మానించింది.

## సుందరయ్య వర్ధంతి - మజ్జిగ చలివేంద్రం!

కమ్యూనిస్ట్ గాంధీ పుచ్చలపల్లి సుందరయ్య 26వ వర్ధంతిని పురస్క

కొరవ 14వ పేజీలో

# మార్కెట్ ఆధునికం - గబ్బు యధాతథం

దేశస్థాయిలోనే అత్యుత్తమ చేపల మార్కెట్ అని ప్రజాప్రతినిధులు, కార్పొరేషన్ అధికారులు చంకలు గుద్దుకొంటున్న డైకస్‌రోడ్డు జలపుష్ప భవన్‌లో లుకలుకలు ఒక్కటొక్కటిగా బయట పడుతున్నాయి. ఈ మార్కెట్‌కు సోకుచేశారే తప్ప ప్రాథమికంగా ఏర్పాటు చేయవలసిన సౌకర్యాలను మర్చిపోవడం వల్ల గబ్బు ముక్కపుటాలదిగి పోతుంది. ఆధునిక జలపుష్ప భవన్ చేపలమ్మే మెయిన్ హాల్ గతంలో నిర్మించిందే. హాలులో చేపలమ్మే అంగళ్లను ఎత్తు పెంచి నిలబడి వ్యాపారాలు చేసుకొనే విధంగా నిర్మించారు. ఒక్కో షాపుకు ఒక్కొక్క కొళాయిని ఏర్పాటుచేసినా మార్కెట్ డ్రైనేజి వ్యవస్థ సక్రమంగా లేకపోవడంతో గబ్బు యధాతథమయ్యింది. డ్రైనేజి వ్యవస్థ సక్రమంగా లేకపోవడం మార్కెట్‌లో ఏర్పాటుచేసిన ఫ్యాన్ల మూలంగా గబ్బు ఇంకా ఎక్కువగా వ్యాపిస్తుంది. చేపలమ్మే దుకాణాల ప్రక్కన ఏర్పాటుచేసిన వేలం ఫ్లాట్‌ఫారం దగ్గర కూడా నీచు నీళ్లు నిలబడి వుంటున్నాయి. దీన్ని ఎప్పటికప్పుడు శుభ్రపరిచే వ్యవస్థ ఏర్పాటు చేయాల్సి వుంది. అత్యాధునికమైన ఈ మార్కెట్‌లో ఐదంటే ఐదు ఎలక్ట్రానిక్ తక్కెడలు కూడా లేవు. పాత మార్కెట్ తరహాలోనే తూకంలో మోసాలు యధాతథంగా జరిగిపోతున్నాయి. చేపలు తోమేవారికి ప్రత్యేకంగా ఏర్పాటుచేసిన ఫ్లాట్ ఫారాలపై వాళ్లు రొయ్యలైతే వలవగలుగుతున్నారు



చేపలుతోమే ఫ్లాట్‌ఫామ్‌పై పేరుకొన్న వ్యర్థాలు.

కానీ చేపలు తోమలేక పోతున్నారు. పాత తరహాలోనే క్రింద కూర్చోవడం వల్ల చేపల వ్యర్థాలు పేరుకపోయి గబ్బు కొడుతుంది. గతంలో చేపలు కొనుగోలు చేసిన వాళ్లు స్వయంగా నిలబడి వీటిని తోమించుకొనే వాళ్లు. ఇప్పుడా వసతి లేకపోవడం వల్ల తోమేవాళ్లు హస్తలాఘవం ప్రదర్శిస్తున్నారు. మార్కెట్‌లో పార్కింగ్ వసతి అయితే కల్పించారు కానీ చేపలు కొని తోమించుకొనే వాళ్లు కూర్చొనేందుకు సిమెంటు బల్లలైనా ఏర్పాటుచేయక పోవడం దారుణం. ఆధునిక చేపల మార్కెట్ అంటే లైట్లు, ఫ్యాన్లు కాదు డ్రైనేజి వ్యవస్థఅని తెలుసుకోక పోవడం బాధాకరం.



# టెన్త్ ఫలితాల్లో నెల్లూరు విద్యార్థుల హవా!

- స్టేట్ ఫస్ట్ ర్యాంకు సాధించిన రత్నం విద్యార్థి



స్టేట్ ఫస్ట్ ర్యాంకు సాధించిన రత్నం హైస్కూల్ విద్యార్థి వెంకటసాయిని అభినందిస్తున్న జిల్లా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి. ప్రక్కన విద్యా సంస్థల డైరక్టర్ వేణుగోపాల్.

21వ తేది ప్రకటించిన పదవ తరగతి పరీక్షా ఫలితాల్లో నెల్లూరు విద్యార్థులు తమ సత్తాచాటారు. రాష్ట్రస్థాయిలో ప్రథమ ర్యాంకుతోపాటు ఐదు, ఎనిమిది ర్యాంకులు కూడా సాధించారు. నెల్లూరు రత్నం హైస్కూలులో చదివిన సాధారణ కుటుంబీకుడైన పులిమి వెంకటసాయి 600 మార్కులకు గాను 595 మార్కులు సాధించి రాష్ట్రంలో ప్రథమునిగా నిలిచాడు. ఉస్మాన్‌సాహెబ్‌పేటలోని రాఘవ స్కూల్ విద్యార్థిని ఎం.స్వర్ణశ్రీ 591 మార్కులు సాధించి రాష్ట్రంలో ఐదవ ర్యాంకు సాధించింది. రత్నం హైస్కూల్‌లోనే చదివిన షేక్ అబ్దుల్ గఫూర్ 590 మార్కులు సాధించి రాష్ట్రంలో ఐదవ ర్యాంకర్‌గా నిలిచాడు. రాఘవ స్కూల్‌కి చెందిన కె.మనోజ్‌కుమార్ 588 మార్కులు, రామలింగాపురం సాయి విద్యానికేతన్‌లో చదివిన తేజేంద్ర 586 మార్కులు, నారాయణ హైస్కూల్‌లో చదివిన పి.అభిజ్ఞరెడ్డి 585 మార్కులు, కావలి నలంద హైస్కూల్‌లో చదివిన మధుహా, కావలి భాష్యం విద్యాసంస్థల్లో చదివిన తనూష 585 మార్కులు తెచ్చుకొన్నారు. కోట ప్రభుత్వ బిసి గురుకుల పాఠశాలలో చదివిన పి.రంగప్రసాద్‌రెడ్డి 583 మార్కులు సాధించాడు. నారాయణ విద్యాసంస్థల్లో చదివిన పి.విజితశ్రీ, కావలి నలందలో చదివిన కరీమున్నీసాలు 583 మార్కులు, నెల్లూరు రత్నం, గూడూరు నారాయణ విద్యాసంస్థల్లో చదివిన సిహెచ్.శివశంకర్, కావ్యప్రణవి 582 మార్కులు సాధించారు. నెల్లూరు రవీంద్ర భారతి విద్యాసంస్థల్లో చదివిన సాయిశ్వేత 580 మార్కులు సాధించింది. అనుమసముద్రంపేట శ్రీకొలను జిల్లా పరిషత్ హైస్కూల్‌లో చదివిన ఎన్.ప్రవల్లిక ప్రభుత్వ స్కూళ్లు తక్కువకాదని చాటిచెబుతూ 577 మార్కులు సాధించింది. మొత్తం మీద పదవ తరగతి పరీక్షలకు జిల్లా నుంచి 30,406 మంది హాజరుకాగా 24,517 మంది విద్యార్థులు ఉత్తీర్ణులయ్యారు.

# నెం.1 ప్రస్థానం ఎప్పుడూ నెం.1 గానే కొనసాగుతుంది

## అందుకు నేటి రవీంద్రభారతి స్కూల్స్ ఫలితాలే సాక్ష్యాలు !

**582**
S. Sarath Chandra, HT.No. 1123105529

ప్రతిభలో..
శ్రద్ధలో...
క్రమశిక్షణలో...
సౌకర్యాలలో...
ఐఐటి, ఒలంపియాడ్
ఫౌండేషన్‌లో...
ఆల్‌రౌండ్ డెవలప్‌మెంట్‌లో...
మార్కుల్లో...
అన్నింటా నెం. **1**

**580**
K. Sai Swetha, HT.No. 1117105203

| Marks | Name, HT.No. |
|---|---|
| 579/600 | S.Premaja, HT.No. 1119125984 |
| 578/600 | I.Raga Malika, HT.No.1123107042 |
| 578/600 | G.V.V.Varun, HT.No. 1117104658 |
| 578/600 | L.Harshini, HT.No.1122101000 |
| 578/600 | Y.Mithun Rao, HT.No. 1105201626 |
| 578/600 | K. Vineetha, HT.No.1105100348 |
| 578/600 | G. Pranathi, HT.No.1137105821 |
| 577/600 | B. Srihitha, HT.No.1137106069 |
| 577/600 | A.Bhavani Prasad, HT.No.1136107412 |
| 576/600 | A BALAJI , HT.No.1123105451 |
| 575/600 | K. Naga Sowmya, HT.No.1123105025 |
| 575/600 | N. Mohith Sai Teja,HT.No.1117104497 |
| 575/600 | V.Chandana, HT.No.1117104944 |
| 575/600 | Revanth, HT.No.1138104077 |
| 575/600 | B P V N Sreenidhi,HT.No. 1123106339 |
| 575/600 | M.Pavan Kumar, HT.No.1119121865 |

స్టేట్‌లో గ్రేడ్‌ల వారిగా మరే స్కూల్ సాధించని అత్యుత్తమ ఫలితాలు రవీంద్రభారతివే

| గ్రేడ్ సాధించినవారు | |
|---|---|
| A1 | 312 |
| A2 | 991 |
| B1 | 310 |
| B2 | 137 |
| C1 | 82 |
| C2 | 19 |
| D1 | 15 |
| D2 | 04 |

**2011లో మరే విద్యాసంస్థ సరిపోల్చుకోలేని రవీంద్రభారతి ఎనాలిసిస్**













drusya

**రవీంద్రభారతి రెసిడెన్షియల్ క్యాంపస్‌లు**


VIJAYAWADA


GUNTUR


NELLORE


KADAPA


KURNOOL


RAJAHMUNDRY


ANANTHAPUR


TIRUPATHI


VIZAG (Dwaraka Nagar)


Hyderabad (DSNR)

### రవీంద్రభారతి ఐఐటి ఒలంపియాడ్ స్కూల్ ప్రత్యేకతలు

- ఒలంపియాడ్ ఫౌండేషన్ శిక్షణకై అంతర్జాతీయ ప్రమాణాలతో శాస్త్రీయ కోణములో ప్రత్యేకంగా రూపొందించిన ఇంటిగ్రేటెడ్ సిలబస్.
- రీజనింగ్, లాజికల్, ఎనలిటికల్ థింకింగ్ లపై ప్రత్యేక శ్రద్ధ.
- వివిధ పోటీపరీక్షలలో అత్యంత కీలకమైన మెంటల్ ఎబిలిటీ పై ప్రత్యేక మెటీరియల్ మరియు శిక్షణ.
- ప్రాజెక్ట్స్, సెమినార్స్, గ్రూప్ డిస్కషన్స్, ఎలక్యూషన్స్, డిబేట్స్ నిర్వహణ.
- వీక్లీ మరియు మంత్లీ టెస్టులు ద్వారా విద్యార్థులపై నిరంతర అసెస్‌మెంట్ మరియు కౌన్సిలింగ్.
- అత్యాధునిక సాంకేతిక పరికరాల సహాయంతో బోధన.
- ఇంటర్నెట్ సౌకర్యముతో అత్యాధునిక కంప్యూటర్ ల్యాబ్ మరియు సైన్స్ ల్యాబ్స్. యోగా, మెడిటేషన్‌తో పాటు, ఇండోర్ మరియు అవుట్ డోర్ గేమ్స్.
- పర్సనాలటి డెవలప్‌మెంట్ మరియు విద్యార్థుల అభిరుచికి తగినట్లుగా యాక్టివిటీస్. కాన్సెప్ట్స్, డెఫినిషన్స్, ఫార్ములాల అవగాహనకై వేర్వేరు స్టడీ మెటీరియల్స్.
- ఫీల్డ్ ట్రిప్స్ మరియు ఎడ్యుకేషనల్ టూర్స్.

### రవీంద్రభారతి ఐఐటి ఒలంపియాడ్ అఛీవ్‌మెంట్స్

**అంతర్జాతీయ స్థాయిలో జరిగే 'నాసా' పోటీ పరీక్షలకు వరుసగా 3 సార్లు ఎన్నికై భారతదేశంలోనే నెం.1 స్కూల్ గా ప్రఖ్యాతి గాంచిన రవీంద్రభారతి స్కూల్**

- అంతర్జాతీయ స్థాయిలో 16 దేశాలు పాల్గొన్న IAIS పరీక్షలో ఇండియాలోనే మొట్టమొదటి సారిగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో 20 Gold Medals తో పాటుగా 35 High Distinctions, 30 Distinctions, 42 Credits తో విజయపతాకం ఎగురవేసిన ఏకైక సంస్థ.
- జాతీయ స్థాయిలో జరిగిన Unified Cyber Olympiad లో ఆల్ ఇండియా 1వ మరియు 8 వ స్థానాలను కైవసం చేసుకొని తొలి 100 ర్యాంకులలో 23 ర్యాంకులను పొందిన సంస్థ.
- ప్రతిష్టాత్మకమైన Regional Maths Olympiad లో మొత్తం అర్హత పొందిన విద్యార్థులలో 30% మా సంస్థ విద్యార్థులే.
- South Indian Maths Olympiad పరీక్షలో అర్హత పొందిన 500 మంది విద్యార్థులలో 160 మంది మా విద్యార్థులే.
- Eduranet National Wide Intellectual Olympiad జాతీయ స్థాయి పరీక్షలో 120 మంది విద్యార్థులు పరిక్షార్హత పొంది వున్నారు.

**ఇంతటి ఘన విజయానికి కారకులైన విద్యార్థులకు, తల్లిదండ్రులకు మరియు ఉపాధ్యాయులకు మా హృదయపూర్వక శుభాకాంక్షలు..**

**అడ్మిషన్లు జరుగుచున్నవి, నర్సరీ నుండి 10వ తరగతి వరకు**

**Nellore**

| | |
|---|---|
| Fathekhanpet (Day & Res.) | : Ramesh Reddy Nagar, Ph : 0861-2334748, Cell : 80966 99522 |
| Olympiad | : Fathekhanpet Main Road, Cell : 8096699504 |
| Nawabpet | : Opp. Sri Mahalakshmi Temple, Nawabpet Main Road, Ph : 0861-2322664. Cell : 80968 10448 |
| **Kavali** | : Opp. Hotel Namaskar, Trunk Road, Ph : 08626-250399, Cell : 8096699744 |
| **Gudur** | : Opp. Ramesh Bakery, Hospital Road, Ph : 08624-253044, Cell : 80968 10449 |
| **Naidupet** | : Opp. Railway Station, Venkateswarapuram, Ph : 08623-247157, Cell : 80968 10450 |
| **Sullurpet** | : Near Venkateswara Temple, S.V.T. Street, Ph : 08623-241911, Cell : 8096810451 |

www.rbschools.in



**Ravindra Bharathi School**
*New Concept, Old Values.*
*Andhra Pradesh*
C.O. Fathekhanpet Nellore, Ph : 0861 - 2334748

## ఠాగూర్‌నవుతా!

**సినిమా డైలాగులు మానని పరసా**



గాంధీజీ కలలు కన్న గ్రామ స్వపరి పాలన కోసం అవసరమైతే మరో ఠాగూర్‌నవుతానని సూళ్లూరుపేట శాసనసభ్యుడు పరసారత్నం వ్యాఖ్యానించారు. పెళ్లకూరు ఎమ్పీడిఓ కార్యాలయంలో వివిధ శాఖల అధికారులతో ఆయన సమీక్ష నిర్వహించారు. ఒకొక్కశాఖ పని తీరుపై పంచాయితీల వారీగా విశ్లేషించిన ఆయన మాట్లాడుతూ మండలంలో పనిచేసే ఎగ్జిక్యూటివ్ అధికారులు వారంలో ఒక గ్రామాన్ని ఎంపిక చేసుకొని అక్కడే బస చేసి ప్రజల సమస్యలను తెలుసుకొని వాటిని పరిష్కరించాలన్నారు. స్వాతంత్ర్యం వచ్చి ఏళ్లు గడుస్తున్నా పల్లె సీమల్లో మౌలిక సదుపాయాలకు ప్రజలు నోచుకోకపోవడం బాధాకరమన్నారు. పోలీసులు మండలంలో మైత్రీ సంఘాలను ఏర్పాటు చేసి శాంతిభద్రతలను పరిరక్షించాలన్నారు. వేసవిని దృష్టిలో వుంచుకొని గ్రామాల్లో త్రాగునీటి సమస్య తలెత్తకుండా ఆర్‌డబ్ల్యుఎస్ అధికారులు తగిన చర్యలు చేపట్టాలని సూచించారు. ఈ సమావేశంలో ఎమ్పీడిఓ ప్రమీలారాణి తదితరులు పాల్గొన్నారు.

## ప్రభుత్వ వైద్యుల పనితీరు మారాలి!

**గూడూరు ఎమ్మెల్యే సలహా**

ప్రభుత్వ వైద్యులు పనితీరు మెరుగుపరచుకోవాలని గూడూరు శాసనసభ్యుడు బల్లి దుర్గాప్రసాద్ హితవు చెప్పారు. స్థానిక ఏరియా ప్రభుత్వ వైద్యశాలలో జరిగిన అభివృద్ధి కమిటీ సమావేశానికి హాజరైన ఆయన ప్రభుత్వ వైద్యుల పనితీరుపై తీవ్ర అసంతృప్తి వ్యక్తం చేశారు. ప్రభుత్వ ఆస్పత్రిలో నిష్ణాతులైన వైద్యులున్నా అతి తక్కువ మంది రోగులు ఆస్పత్రికి రావడం బాధాకరమన్నారు. అదే ప్రైవేట్ ఆస్పత్రులు రోగులతో కిటకిటలాడుతున్నాయని రెండు ఆస్పత్రుల్లో గల వ్యత్యాసాలను ఆయన ప్రస్తావించారు. పేదలకు వైద్య సేవలు అందించడంలో నిర్లక్ష్యంగా వ్యవహరిస్తుండడం, వారి పట్ల ప్రేమ పూర్వకంగా వ్యవహరించ లేకపోవడం వలనే ప్రభుత్వ ఆస్పత్రులకు వచ్చే రోగుల సంఖ్య తగ్గిపోతోందని ఆవేదన వ్యక్తం చేశారు. అదే డాక్టర్లు తమ ప్రైవేట్ క్లినిక్‌లకు వచ్చే రోగులకు మాత్రం చక్కని వైద్యం అందించడం ఎంతవరకు సమంజసమన్నారు. వేలాది రూపాయలు ప్రభుత్వం నుంచి జీతాలుగా తీసుకొంటూ విధి నిర్వహణ సక్రమంగా చేయకపోవడం బాధాకరమన్నారు. ఇకనైనా పనితీరు మెరుగుపరచుకోవాలని, ఎల్లవేళలా వైద్యులు ఆస్పత్రుల్లో అందుబాటులో వుండాలని హితవు పలికారు.

## వైఎస్ కుటుంబానికి ఎనలేని ఆదరణ

పాలనాదక్షతతో రాష్ట్రంలో విప్లవాత్మక పథకాలను ప్రవేశపెట్టి విజయవంతంగా అమలు చేసిన దివంగత నేత వైఎస్ రాజశేఖర్‌రెడ్డి కుటుంబానికే జనాదరణ మెండుగా వుందని అల్లూరు మాజీ శాసనసభ్యుడు కాటంరెడ్డి విష్ణువర్ధన్‌రెడ్డి స్పష్టం చేశారు. కడప పార్లమెంటు, పులివెందుల శాసనసభ నియోజకవర్గాల నుంచి భారీ మెజార్టీతో వైఎస్ జగన్మోహన్‌రెడ్డి, విజయమ్మలు గెలిచిన సందర్భంగా అల్లూరులో విలేకరులతో మాట్లాడారు. వైఎస్ వారసునిగా

**కడప సంగతులు చెప్పిన విష్ణు!**

జగన్‌ను రాష్ట్ర ప్రజలంతా కోరుకుంటున్నారని, దీనికి ఈ ఎన్నికల ఫలితాలే నిదర్శనమన్నారు. టిడిపి, కాంగ్రెస్ పార్టీలు కుమ్మక్కైనా ప్రజల విశ్వాసాన్ని పొందలేకపోయాయన్నారు. ఓటర్లు వజ్రాయుధం లాంటి ఓటు హక్కు ద్వారా వివిధ పార్టీల నేతలు దిమ్మతిరిగేలా తీర్పు నిచ్చారన్నారు. ప్రజలందరి ఆకాంక్షలకు అనుగుణంగా రానున్న రోజుల్లో వైఎస్ జగన్ రాష్ట్రానికి నాయకత్వం వహించడం ఖాయమని జోస్యం చెప్పారు.

## ఎర్రచందనం స్మగ్లర్ల సమావేశం!

**నిద్రపోతున్న కలువాయి పోలీసు**

కలువాయిలో ఎర్రచందనం అక్రమ రవాణా జోరందుకొన్న విషయం తెలిసిందే. నిన్నమొన్నటి వరకు ఎలాంటి ఆటంకాలు లేకుండా సాగిపోతున్న ఈ వ్యవహారంలో స్మగ్లర్ల మధ్య విభేదాలు పొడచూపడం ఫలితంగా పట్టుబడడం జరుగుతుంది. దీనిపై ఈ ప్రాంత స్మగ్లర్లందరూ కలువాయిలో ఇటీవల ఒక రహస్య సమావేశం నిర్వహించడం కలకలం లేపింది. స్థానికంగా వుండే స్మగ్లర్లతోపాటు అంతరాష్ట్ర స్మగ్లర్లు ఈ సమావేశానికి హాజరైనట్లు సమాచారం. తక్కువ సమయంలో అధిక ఆదాయం సమకూరుతుండడంతో పలువురు క్రొత్తవాళ్లు ఎర్రచందనం అక్రమ రవాణాకు పాల్పడుతున్నారు. ఈ పరిస్థితుల్లో వీరి మధ్య విభేదాలు ఏర్పడుతున్నాయి. ఒకరిపై ఒకరు అధికారులకు సమాచారం అందించి చందనాన్ని పట్టిస్తుండడంతో మొత్తంగా అక్రమ రవాణాపై దీని ప్రభావం పడుతుందని ఈ సమావేశం ఏర్పాటు చేశారట. విభేదాలు ప్రక్కన పెట్టి అందరూ కలసి కట్టుగా ఈ వ్యాపారం కొనసాగించాలని అంతరాష్ట్ర స్మగ్లర్లు సూచించారట. నిర్భయంగా స్మగ్లర్లు కలువాయిలో సమావేశం ఏర్పాటు చేసినా స్థానిక పోలీసులు, ఫారెస్టు అధికారులకు ఈ సమాచారం తెలియలేదా? తెలిసీ తెలియనట్లు వున్నారా అనే అనుమానాలు వ్యక్తం అవుతున్నాయి.

● ప్రభుత్వ భూములు

## ఆక్రమిస్తే క్రిమినల్ చర్యలు!

**కలెక్టర్ హెచ్చరిక**



ప్రభుత్వ భూములను ఆక్రమించే వారిపై క్రిమినల్ చర్యలు చేపడుతామని జిల్లా కలెక్టర్ శ్రీధర్ హెచ్చరించారు. పొదలకూరు తహశీల్దార్ కార్యాలయాన్ని తనిఖీ చేపట్టిన కలెక్టర్ మాట్లాడుతూ పొదలకూరు పట్టణం నెల్లూరుకు సమీపంలో వుండడంతో ఇక్కడ భూముల ధరలు బాగా పెరిగాయన్నారు. దీంతో భూఆక్రమణలకు పాల్పడుతుండడంతో సమస్యలు ఎదురౌతున్నాయన్నారు. ప్రభుత్వ భూములను ఆక్రమించే వారిని, నిబంధనలకు విరుద్ధంగా లేఅవుట్లు వేసే వారిని ఉపేక్షించమని వారిపై క్రిమినల్ చర్యలు తప్పవన్నారు. అనంతరం ఆయన ప్రభుత్వ వైద్యశాలను తనిఖీ చేశారు. ఈ ఆసుపత్రిలో అన్ని విభాగాలను పరిశీలించారు. అలాగే రాపూరు మార్గంలో దుగ్గంట ఎస్సీ కాలనీ వద్ద జరుగుతున్న రోడ్డు లెవలింగ్ పనులను పరిశీలించారు. కలెక్టర్ వెంట నెల్లూరు ఆర్టీవో వేణుగోపాలరెడ్డి, పొదలకూరు తహశీల్దార్ పరంధామయ్య, ఎమ్పీడిఓ సరళ తదితరులు పాల్గొన్నారు.

# మాడరన్ స్కూల్‌లో మాడరన్ విద్య!



నెల్లూరు సరస్వతీనగర్‌లో 1980 సంవత్సరంలో స్థాపించిన మాడరన్ స్కూల్ విద్యాబోధన, ఫలితాల సాధనలో నాటి నుండి నేటి వరకు ముందుంటున్నది. మారుతున్న కాలానికి అనుగుణంగా విద్యావిధానంలో వస్తున్న ఆధునాతన సాంకేతిక పద్ధతులకు అనుగుణంగా విద్యాబోధన చేస్తుండడం వల్ల రాష్ట్ర స్థాయిలోనే కాక అంతర్జాతీయ స్థాయిలోనూ మాడరన్ స్కూల్ విద్యార్థులు అలవోకగా రాణిస్తున్నారు.

### *మైక్రోసాఫ్ట్‌లో మాడరన్ విద్యార్థి!*

ప్రపంచ ప్రఖ్యాతి చెందిన మైక్రోసాఫ్ట్ సంస్థలో ఇచ్చిన శిక్షణకు ప్రపంచంలోని పలు దేశాల నుంచి వచ్చిన 77మంది అభ్యర్థులలో ఎంపికైన ఏకైక విద్యార్థి మాడరన్ స్కూల్ విద్యార్థి అంటే ఇక్కడి విద్యావిధానం ఎటువంటిదో అర్థం చేసుకోవచ్చు.

### *జపాన్ రాజును కలసిన స్కూల్ విద్యార్థిని!*

జపాన్ దేశంలో రెడ్‌క్రాస్ సంస్థ నిర్వహించిన సదస్సులో భారతదేశం తరఫున జపాన్‌ను సందర్శించిన ఏకైక విద్యార్థిని మాడరన్ స్కూల్ విద్యార్థినే. ఈ సదస్సులో పాల్గొన్న 13 దేశాల ప్రతినిధి బృందానికి నాయకురాలిగా వ్యవహరించి జపాన్ రాజుకు మెమోరాండం ఇచ్చిన ఘనత మాడరన్ స్కూల్ విద్యార్థినికే దక్కింది.

### *'ఇండియా టుడే' సర్వేలో బెస్ట్ స్కూల్ అవార్డు!*

ప్రతి ఏడాది పదవ తరగతి పరీక్షా ఫలితాల్లో నూటికి నూరు శాతం విద్యార్థులు ప్రథమ తరగతిలో పాసవ్వడమే కాకుండా 85శాతం మంది డిస్టింక్షన్ పొందడం క్రమం తప్పకుండా జరుగుతోంది. ఈ విషయమై ఇండియా టుడే పత్రిక నిర్వహించిన రాష్ట్ర వ్యాప్త సర్వేలో రాష్ట్రంలోనే 20 కొత్త తరహా పాఠశాలల్లో ముందు భాగంలో నిలిచిన స్కూల్ మాడరన్ స్కూలే.

### *ఆధునాతన బోధన*

పరిమిత సంఖ్యలో విద్యార్థులు, క్రమశిక్షణ, సబ్జెక్టులలో పూర్తి అవగాహనతో క్రమం తప్పని బోధన స్కూల్ ప్రత్యేకతలు. ఆంగ్ల భాషను స్టైలిష్‌గా బోధించడం ఈ స్కూల్ ప్రత్యేకత. చూడచక్కని వాతావరణం, మంచి భవన వసతి, సైన్స్ ల్యాబ్, మాథ్స్ ల్యాబ్, విశాలమైన ఆట స్థలం స్కూల్‌లో అదనపు ఆకర్షణలు.

### *ఈయేటి మేటి ఫలితాలు*

ఈ యేడాది పదవ తరగతి పరీక్షా ఫలితాల్లో స్కూల్ విద్యార్థులు 581, 580, 576, 573, 571, 570, 569, 566, 563, 562, 560 వంటి అత్యుత్తమ మార్కులు సాధించారు. నూటికి నూరు శాతం ఫలితాలతోపాటు లెక్కల్లో 22 మంది విద్యార్థులు నూటికి నూరు మార్కులు సాధించారు. 550కి పైగా మార్కులు 22 మంది, 500 పైగా మార్కులు 40 మంది సాధించారు.

### *టెక్నాలజీ విద్య*

విద్యారంగంలో ఆధునిక టెక్నాలజీతో వస్తున్న Teach Next, Zee learn, Mikids వంటి సంస్థలతో సాంకేతిక ఒప్పందం కుదుర్చుకున్న విద్యాసంస్థ మాడరన్ స్కూలేనని ఘంటాపథంగా చెప్పొచ్చు. ఈ కొత్త విధానంలో విద్యాబోధన ద్వారా విద్యార్థులలో సృజనాత్మకశక్తిని వెలికి తీయవచ్చు. భవిష్యత్తులో రాయాల్సిన పలు పోటీ పరీక్షలకు ఈ విధానంలో బోధన ఎంతో మేలు చేస్తుంది. నెల్లూరులో ఆధునిక విద్యకు చిరునామా మాడరన్ స్కూల్.



# DR. SRK. SCHOOL

(Recognised by the Govt of A.P.)
Magunta Layout, Nellore - 524 003. Ph: 2325199

ప్రతి విద్యార్థి ప్రగతే మా లక్ష్యం : : ప్రతిభగల ఉపాధ్యాయులు - విద్యార్థుల మేలి కలయిక

## SSC Results - 2011

| No. | Name | Tel | Hin | Eng | Mat | Sci | Soc | Tot | Per |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | S.Susmitha | 96 | 97 | 92 | 100 | 99 | 99 | 583 | 97.17 |
| 2. | N.Saitejaswini | 98 | 98 | 81 | 100 | 99 | 99 | 575 | 95.83 |
| 3. | A.Suhrudha | 97 | 95 | 94 | 100 | 95 | 94 | 575 | 95.83 |
| 4. | C.Harika | 97 | 93 | 89 | 100 | 98 | 94 | 571 | 95.17 |
| 5. | D.V.S.Akhil Mishranth | 96 | 93 | 88 | 99 | 99 | 96 | 571 | 95.17 |
| 6. | B.Manasa | 97 | 96 | 82 | 100 | 98 | 97 | 570 | 95.00 |
| 7. | M.Divyaa | 95 | 91 | 87 | 99 | 99 | 99 | 570 | 95.00 |
| 8. | T.Vasudha | 98 | 96 | 80 | 100 | 99 | 97 | 570 | 95.00 |
| 9. | N.S.L.Susmitha | 93 | 96 | 84 | 100 | 98 | 99 | 570 | 95.00 |
| 10. | V.Sahithi Sindhu | 96 | 96 | 80 | 100 | 99 | 98 | 569 | 94.83 |
| 11. | K.Sai Lakshmi Javali | 94 | 97 | 86 | 100 | 95 | 97 | 569 | 94.83 |
| 12. | P.Harshika | 95 | 91 | 88 | 100 | 99 | 95 | 568 | 94.67 |
| 13. | B.Geetha Nagamani | 95 | 92 | 86 | 100 | 97 | 98 | 568 | 94.67 |
| 14. | B.Srikar Yadav | 90 | 96 | 86 | 100 | 98 | 97 | 567 | 94.50 |
| 15. | K.Divya Supraja | 92 | 96 | 88 | 100 | 95 | 96 | 567 | 94.50 |
| 16. | V.Sarikraanthi | 96 | 91 | 86 | 100 | 97 | 96 | 566 | 94.33 |
| 17. | A.S.A.Nivalika | 91 | 96 | 86 | 100 | 98 | 94 | 565 | 94.17 |
| 18. | K.Greeshma Divya | 97 | 97 | 82 | 100 | 96 | 93 | 565 | 94.17 |
| 19. | P.Sumaya Banu | 94 | 95 | 85 | 100 | 97 | 94 | 565 | 94.17 |
| 20. | K.Pramodh | 93 | 91 | 89 | 100 | 96 | 95 | 564 | 94.00 |
| 21. | R.Nikilasai | 95 | 92 | 87 | 100 | 97 | 93 | 564 | 94.00 |
| 22. | D.Venkata Saivi | 98 | 94 | 87 | 96 | 96 | 93 | 564 | 94.00 |
| 23. | K.Krishna Teja | 90 | 88 | 91 | 100 | 98 | 96 | 563 | 93.83 |
| 24. | P.Sravya | 94 | 92 | 86 | 100 | 92 | 98 | 562 | 93.67 |
| 25. | M.Swetha | 96 | 94 | 86 | 98 | 92 | 96 | 562 | 93.67 |
| 26. | K.Hema Sandhya | 93 | 94 | 82 | 100 | 95 | 98 | 562 | 93.67 |
| 27. | N.Lakshmi Prathyusha | 95 | 90 | 85 | 100 | 94 | 98 | 562 | 93.67 |
| 28. | M.Padmasree | 95 | 88 | 89 | 99 | 96 | 93 | 560 | 93.33 |
| 29. | H.Akhil | 89 | 94 | 81 | 100 | 97 | 99 | 560 | 93.33 |
| 30. | A.Pravallika | 91 | 95 | 85 | 98 | 91 | 99 | 559 | 93.17 |
| 31. | K.Prananka | 94 | 95 | 76 | 100 | 98 | 95 | 558 | 93.00 |
| 32. | I.Indu Lakshmi | 96 | 98 | 81 | 96 | 93 | 94 | 558 | 93.00 |
| 33. | G.Keerthi | 97 | 79 | 89 | 100 | 96 | 97 | 558 | 93.00 |
| 34. | Ch.Yeshwanth Sai | 97 | 91 | 77 | 99 | 96 | 97 | 557 | 92.83 |
| 35. | N.Likhitha | 92 | 96 | 78 | 100 | 94 | 95 | 555 | 92.50 |
| 36. | M.Charan | 93 | 88 | 79 | 100 | 95 | 100 | 555 | 92.50 |
| 37. | T.Niharika | 94 | 91 | 80 | 100 | 94 | 95 | 554 | 92.33 |
| 38. | L.Nairmitha Rao | 94 | 90 | 82 | 99 | 94 | 95 | 554 | 92.33 |
| 39. | I.Phani Bhargav Krishna | 96 | 87 | 74 | 100 | 99 | 98 | 554 | 92.33 |
| 40. | M.Venkata Karthik | 96 | 90 | 90 | 91 | 95 | 91 | 553 | 92.17 |
| 41. | E.Chandana | 88 | 95 | 84 | 99 | 88 | 98 | 552 | 92.00 |
| 42. | S.Nagasri Pooja | 96 | 89 | 79 | 99 | 91 | 97 | 551 | 91.83 |
| 43. | T.Jahnavi | 90 | 95 | 82 | 94 | 92 | 97 | 550 | 91.67 |
| 44. | Ch.Venkata Sandeep | 93 | 87 | 77 | 100 | 98 | 95 | 550 | 91.67 |
| 45. | K.Harinikhita | 87 | 92 | 86 | 99 | 91 | 94 | 549 | 91.50 |
| 46. | S.Manogna | 90 | 94 | 77 | 99 | 92 | 97 | 549 | 91.50 |
| 47. | Sk.Thabrees | 92 | 88 | 88 | 99 | 90 | 92 | 549 | 91.50 |
| 48. | V.Sri Lalitha | 91 | 93 | 82 | 96 | 94 | 92 | 548 | 91.33 |
| 49. | P.Prathyusha | 91 | 95 | 80 | 99 | 92 | 91 | 548 | 91.33 |
| 50. | K.Mano Teja | 95 | 86 | 78 | 99 | 97 | 92 | 547 | 91.17 |
| 51. | G.Vamsidhar | 90 | 92 | 73 | 98 | 97 | 96 | 546 | 91.00 |
| 52. | V.Sowmya | 92 | 95 | 89 | 96 | 82 | 92 | 546 | 91.00 |
| 53. | M.Eswar Venkata Prasad | 95 | 88 | 72 | 99 | 94 | 98 | 546 | 91.00 |
| 54. | T.V.Nishanth Joel | 89 | 96 | 80 | 98 | 94 | 88 | 545 | 90.83 |
| 55. | Sk.Naveed Ahmad | 88 | 91 | 80 | 100 | 91 | 94 | 544 | 90.67 |
| 56. | A.Venkata Vasudha | 95 | 91 | 75 | 98 | 93 | 92 | 544 | 90.67 |
| 57. | K.Bhanuhruday Reddy | 89 | 88 | 81 | 98 | 93 | 95 | 544 | 90.67 |
| 58. | M.Kedareswar | 88 | 79 | 82 | 99 | 97 | 98 | 543 | 90.50 |
| 59. | K.Hasmitha | 95 | 89 | 84 | 98 | 92 | 84 | 542 | 90.33 |
| 60. | K.V.Krishna | 89 | 83 | 81 | 100 | 91 | 97 | 541 | 90.17 |
| 61. | P.Manisha | 95 | 88 | 73 | 98 | 94 | 93 | 541 | 90.17 |
| 62. | K.Subhash Raj | 94 | 92 | 74 | 94 | 92 | 95 | 541 | 90.17 |
| 63. | K.Roshini | 89 | 94 | 86 | 98 | 90 | 84 | 541 | 90.17 |
| 64. | A.Divya Reddy | 98 | 89 | 71 | 98 | 89 | 95 | 540 | 90.00 |
| 65. | R.Thanmayi | 81 | 98 | 82 | 91 | 92 | 96 | 540 | 90.00 |
| 66. | M.Praveen Yadav | 88 | 92 | 78 | 98 | 88 | 95 | 539 | 89.83 |
| 67. | L.Keerthana | 94 | 75 | 78 | 100 | 95 | 97 | 539 | 89.83 |
| 68. | A.Sai Jagathi | 87 | 84 | 84 | 100 | 86 | 97 | 538 | 89.67 |
| 69. | V.Prasanth | 87 | 94 | 76 | 99 | 87 | 95 | 538 | 89.67 |
| 70. | P.Karthik | 87 | 97 | 72 | 96 | 92 | 94 | 538 | 89.67 |
| 71. | D.Manasa | 91 | 83 | 78 | 98 | 93 | 94 | 537 | 89.50 |
| 72. | V.Pavani | 95 | 92 | 74 | 94 | 93 | 89 | 537 | 89.50 |
| 73. | S.Monika | 94 | 87 | 83 | 97 | 92 | 83 | 536 | 89.33 |
| 74. | R.Sasidhar Reddy | 88 | 92 | 79 | 93 | 95 | 89 | 536 | 89.33 |
| 75. | R.V.R.Sai Anudeep | 90 | 88 | 75 | 100 | 88 | 95 | 536 | 89.33 |
| 76. | Sd.Maaz Alvi | 92 | 95 | 77 | 96 | 87 | 89 | 536 | 89.33 |
| 77. | R.Venkata Mohan Malavya | 89 | 92 | 66 | 100 | 88 | 100 | 535 | 89.17 |
| 78. | B.Sushen | 77 | 88 | 81 | 100 | 94 | 95 | 535 | 89.17 |
| 79. | Z.Nivee Sanjana | 88 | 87 | 81 | 97 | 90 | 91 | 534 | 89.00 |
| 80. | N.Gururakesh Reddy | 82 | 91 | 75 | 91 | 93 | 99 | 531 | 88.50 |
| 81. | K.Monicakiran Reddy | 87 | 81 | 85 | 98 | 89 | 90 | 530 | 88.30 |
| 82. | Kotha Venkata Sandeep | 81 | 86 | 80 | 99 | 89 | 93 | 528 | 88.00 |
| 83. | E.Spandana | 93 | 91 | 71 | 98 | 88 | 86 | 527 | 87.83 |
| 84. | K.Avinash | 84 | 92 | 74 | 95 | 85 | 96 | 526 | 87.67 |
| 85. | I.Jahnavi | 65 | 94 | 84 | 97 | 90 | 96 | 526 | 87.67 |
| 86. | T.Sai Arun | 86 | 96 | 79 | 95 | 74 | 96 | 526 | 87.67 |
| 87. | K.Mydhili Sai Mrudula | 86 | 77 | 80 | 100 | 87 | 95 | 525 | 87.50 |
| 88. | N.Hareesh Kumar Reddy | 97 | 55 | 80 | 100 | 97 | 96 | 525 | 87.50 |
| 89. | N.Sai Varshitha | 90 | 79 | 82 | 93 | 83 | 98 | 525 | 87.50 |
| 90. | U.Bhavanram | 88 | 91 | 76 | 91 | 85 | 93 | 524 | 87.33 |
| 91. | P. Venkata Sujitha Priya | 88 | 90 | 72 | 98 | 84 | 91 | 523 | 87.17 |
| 92. | C.P.V.S.Prudhvi | 87 | 92 | 74 | 98 | 87 | 85 | 523 | 87.17 |
| 93. | S.Sai Greeshmi | 90 | 81 | 76 | 97 | 92 | 86 | 522 | 87.00 |
| 94. | S.Chandra Mouli | 84 | 88 | 78 | 92 | 86 | 94 | 522 | 87.00 |
| 95. | K.Jaswanth Chandra Reddy | 87 | 91 | 65 | 97 | 88 | 94 | 522 | 87.00 |
| 96. | S.Kavya | 90 | 83 | 71 | 94 | 93 | 90 | 521 | 86.83 |
| 97. | K.Radha | 90 | 94 | 77 | 95 | 70 | 95 | 521 | 86.83 |
| 98. | D.Venkata Sai Prem Kumar | 91 | 80 | 75 | 91 | 86 | 98 | 521 | 86.83 |
| 99. | R.Chaithanya Swarup | 81 | 92 | 71 | 94 | 92 | 90 | 520 | 86.67 |
| 100. | B.Vijaya Lakshmi | 88 | 84 | 73 | 94 | 96 | 85 | 520 | 86.67 |
| 101. | S.Anuja | 86 | 80 | 82 | 97 | 92 | 81 | 518 | 86.33 |
| 102. | K.Koushik Krishna | 77 | 93 | 85 | 92 | 78 | 93 | 518 | 86.33 |
| 103. | V.Sai Bharath | 81 | 81 | 65 | 100 | 94 | 97 | 518 | 86.33 |
| 104. | M.Nitheesha | 92 | 84 | 77 | 97 | 77 | 90 | 517 | 86.17 |
| 105. | Y.Saideep | 80 | 80 | 77 | 100 | 88 | 92 | 517 | 86.17 |
| 106. | M.G.Lakshmi Prasuna | 85 | 87 | 84 | 87 | 90 | 83 | 516 | 86.00 |
| 107 | N.V.Sahith Reddy | 87 | 73 | 71 | 98 | 95 | 91 | 515 | 85.83 |
| 108 | Ch.Naveen Krishna | 78 | 85 | 80 | 99 | 87 | 85 | 514 | 85.67 |
| 109 | R.Pavani | 95 | 75 | 74 | 99 | 83 | 88 | 514 | 85.67 |
| 110. | P.Sreelekha | 97 | 83 | 67 | 98 | 81 | 88 | 514 | 85.67 |
| 111. | G. Nagalasya | 82 | 81 | 75 | 93 | 91 | 90 | 512 | 85.33 |
| 112. | A.Aishwaryaroy | 79 | 82 | 84 | 84 | 88 | 94 | 511 | 85.17 |
| 113. | M.Amulya | 84 | 86 | 74 | 96 | 81 | 90 | 511 | 85.17 |
| 114. | K.Chandana Sameera | 80 | 86 | 76 | 94 | 85 | 90 | 511 | 85.17 |
| 115. | K.Nishma | 91 | 87 | 66 | 91 | 83 | 92 | 510 | 85.00 |
| 116. | P.Sainikhila | 79 | 91 | 84 | 77 | 87 | 91 | 509 | 84.83 |
| 117. | M.Venkata Naga Akhil | 75 | 89 | 75 | 90 | 91 | 89 | 509 | 84.53 |
| 118. | S.Penchala Hemanth Reddy | 79 | 90 | 67 | 97 | 83 | 92 | 508 | 84.67 |
| 119. | A.Karuna | 87 | 89 | 85 | 80 | 83 | 80 | 504 | 84.00 |
| 120. | D.Lokesh | 76 | 90 | 71 | 98 | 79 | 87 | 501 | 83.50 |
| 121. | Md.Saba Tarannum | 71 | 82 | 73 | 91 | 93 | 91 | 501 | 83.50 |
| 122. | N.Divya | 77 | 85 | 78 | 92 | 75 | 93 | 500 | 83.33 |
| 123. | K.Kundana Reddy | 76 | 85 | 78 | 91 | 74 | 94 | 498 | 83.00 |
| 124. | P.Gowrish | 81 | 85 | 71 | 86 | 83 | 91 | 497 | 82.83 |
| 125. | A.V.N.S.Achuth | 76 | 88 | 67 | 92 | 81 | 93 | 497 | 82.83 |
| 126. | A.Bhavana Choudary | 89 | 74 | 66 | 93 | 84 | 90 | 496 | 82.67 |
| 127. | Y.Supriya | 85 | 71 | 77 | 82 | 90 | 90 | 495 | 82.50 |
| 128. | T.Shyamsunder | 70 | 80 | 72 | 93 | 84 | 96 | 495 | 82.50 |
| 129. | P.Sowmya | 81 | 81 | 76 | 93 | 70 | 93 | 494 | 82.33 |
| 130. | G.Dhanyasri Harini | 92 | 74 | 74 | 95 | 81 | 77 | 493 | 82.17 |
| 131. | M.Sai Sumanth | 75 | 76 | 78 | 94 | 83 | 87 | 493 | 82.17 |
| 132. | M.Pradeep | 92 | 81 | 64 | 87 | 86 | 81 | 491 | 81.83 |
| 133. | K.Karthik | 87 | 62 | 69 | 84 | 95 | 93 | 490 | 81.67 |
| 134. | G.Finney Joel | 64 | 90 | 77 | 85 | 82 | 92 | 490 | 81.67 |
| 135. | V.Haripriya | 87 | 90 | 62 | 89 | 79 | 82 | 489 | 81.50 |
| 136. | M.Chandan Kumar Reddy | 86 | 81 | 66 | 97 | 88 | 70 | 488 | 81.33 |
| 137. | Md.Sabitha Tamkeen | 86 | 87 | 74 | 93 | 76 | 71 | 487 | 81.17 |
| 138. | Sk.Sameer | 83 | 73 | 73 | 87 | 90 | 79 | 485 | 80.83 |
| 139. | Ch.Blessy Vathsalya | 78 | 70 | 72 | 91 | 85 | 89 | 485 | 80.83 |
| 140. | G.Arun | 82 | 73 | 63 | 96 | 81 | 89 | 484 | 80.67 |
| 141. | N.Sujitha | 78 | 88 | 64 | 92 | 85 | 77 | 484 | 80.67 |
| 142. | N.Sai Teja | 66 | 77 | 71 | 97 | 81 | 92 | 484 | 80.67 |
| 143. | K.Susmitha | 76 | 84 | 72 | 96 | 82 | 74 | 484 | 80.67 |
| 144. | V.Srinivasa Pradeep | 75 | 73 | 68 | 98 | 80 | 90 | 484 | 80.67 |
| 145. | G.Sai Sreetheja | 64 | 89 | 68 | 88 | 83 | 91 | 483 | 80.50 |
| 146. | M.Mounika | 63 | 94 | 68 | 85 | 93 | 80 | 483 | 80.50 |
| 147. | P.Nirupadevi | 88 | 86 | 69 | 81 | 87 | 71 | 482 | 80.33 |
| 148. | K.V.Ganesh | 89 | 59 | 69 | 94 | 84 | 86 | 481 | 80.17 |
| 149. | M.Rahul Reddy | 72 | 85 | 68 | 89 | 76 | 90 | 480 | 80.00 |
| 150. | P.Sai Krishna | 89 | 73 | 62 | 76 | 93 | 87 | 480 | 80.00 |
| 151. | A. Akhil | 71 | 93 | 73 | 87 | 63 | 89 | 476 | 79.33 |
| 152. | N.Karthik | 79 | 67 | 67 | 100 | 73 | 89 | 475 | 79.17 |
| 153. | G.Raja Monica | 93 | 58 | 65 | 94 | 77 | 89 | 475 | 79.17 |
| 154. | M.Harsha Teja | 73 | 50 | 65 | 99 | 92 | 93 | 472 | 78.67 |
| 155. | P.Kushwanth Kumar | 66 | 64 | 68 | 92 | 93 | 87 | 470 | 78.33 |
| 156. | M.Venkat Vamsi Sai | 85 | 62 | 65 | 98 | 78 | 82 | 470 | 78.33 |
| 157. | G.Rohit | 82 | 57 | 83 | 83 | 83 | 81 | 469 | 78.17 |
| 158. | L.Pranathi | 61 | 85 | 69 | 93 | 94 | 66 | 468 | 78.00 |
| 159. | G.Mounika Chowdary | 77 | 73 | 71 | 93 | 74 | 80 | 468 | 78.00 |
| 160. | P.Naagesh | 69 | 87 | 72 | 85 | 66 | 88 | 467 | 77.83 |
| 161. | A.Junendra Kumar | 58 | 81 | 76 | 93 | 69 | 86 | 463 | 77.17 |
| 162. | A.Suryatej | 74 | 82 | 58 | 90 | 78 | 81 | 463 | 77.17 |
| 163. | M.Akhil Ramanujan | 63 | 65 | 73 | 85 | 86 | 90 | 462 | 77.00 |
| 164. | A.Sricharan | 78 | 63 | 62 | 94 | 78 | 85 | 460 | 76.67 |
| 165. | M.Jhansi | 87 | 61 | 56 | 86 | 80 | 88 | 458 | 76.33 |
| 166. | B.Sai Charan Reddy | 78 | 63 | 71 | 79 | 82 | 85 | 458 | 76.33 |
| 167. | T.Kavya Reddy | 71 | 81 | 79 | 71 | 65 | 87 | 454 | 75.67 |
| 168. | P.Sai Kumar | 69 | 82 | 62 | 89 | 69 | 82 | 453 | 75.50 |
| 169. | G.Mamatha | 63 | 88 | 62 | 87 | 71 | 80 | 451 | 75.17 |
| 170. | G.Vinay Kumar | 86 | 70 | 68 | 79 | 67 | 79 | 449 | 74.83 |
| 171. | N.Akhil Karthik | 79 | 64 | 67 | 90 | 70 | 74 | 444 | 74.00 |
| 172. | S.Harshitha | 81 | 77 | 67 | 64 | 80 | 73 | 442 | 73.67 |
| 173. | V.Vishnu Priya | 80 | 52 | 56 | 86 | 72 | 95 | 441 | 73.50 |
| 174. | A.Sushma Lalitha | 62 | 85 | 61 | 72 | 69 | 81 | 430 | 71.67 |
| 175. | P.Reshma | 59 | 78 | 72 | 65 | 56 | 86 | 416 | 69.33 |
| 176. | P.Bhanu Alekya | 84 | 67 | 54 | 52 | 80 | 78 | 415 | 69.17 |
| 177. | D.Srinivasa Sai | 51 | 71 | 61 | 84 | 60 | 86 | 413 | 68.83 |
| 178. | P.Manley Samuel | 66 | 48 | 80 | 74 | 58 | 86 | 412 | 68.67 |
| 179. | P.Geetanjali | 68 | 75 | 67 | 77 | 61 | 62 | 410 | 68.33 |
| 180. | D.M.V.L.Mythili | 60 | 64 | 59 | 77 | 69 | 78 | 407 | 67.83 |
| 181. | B.Akhil Adithya | 57 | 86 | 54 | 65 | 63 | 80 | 405 | 67.50 |
| 182. | K.Pravallika | 73 | 87 | 65 | 47 | 60 | 71 | 403 | 67.17 |
| 183. | S.Sneha Chowdary | 63 | 58 | 64 | 70 | 69 | 75 | 399 | 66.50 |
| 184. | V.Preethi | 74 | 76 | 68 | 56 | 56 | 68 | 398 | 66.33 |
| 185. | M.Venkata Sai Santhosh | 54 | 31 | 53 | 74 | 48 | 61 | 321 | 53.50 |

| | |
|---|---|
| A1 - | 44 |
| A2 - | 78 |
| B1 - | 48 |
| B2 - | 14 |
| C1 - | 1 |
| | 185 |

**100% ఫలితాలు**
550 + మార్కులు - 44
500 + మార్కులు - 122
80% మార్కులు - 150
Maths 100/100 - 43 మంది

**Admissions from June 1st to 12th**

**Smt M. Beulah Grace,** B.Sc., B.Ed
Head Mistress

**School Reopening on 6th June**

**P. Krishna Murthy** M.Com.,
Principal / Correspondent

# చరిత్ర సృష్టించింది... రికార్డు తిరగరాసింది... "రత్నం" STATE 1st



కె.వి. రత్నం.
ఛైర్మన్




P. Venkat Sai
H.T.No.1117105629

State 5th




SK. Abdul Gaffoor
H.T.No.1117101267




V. Vinay Chowdary
H.T.No.1117103555

| Marks | Name | H.T.No. |
|---|---|---|
| 583 | P. Sreehitha | H.T.No.1117103929 |
| 583 | V. Sai Himavarsha | H.T.No.1117103143 |
| 582 | CH. Shiva Shankar | H.T. No.1117111879 |
| 579 | M. Vaishnavi | H.T.No.1117104439 |
| 579 | P. Phani Madhuri | H.T.No.1117105068 |
| 579 | D. Girish | H.T.No.1117105064 |
| 579 | Samala Varshaditya | H.T. No.1119121151 |
| 579 | A. Mani Sumanth | H.No.1117109059 |
| 578 | Harika.G | H.T. No.1117106635 |
| 575 | M. Himaswetha | H.No.1117106571 |
| 575 | M.V. Anil Manoj | H.T.No.1117102430 |
| 574 | Jessica.V | H.T. No.1117108458 |
| 574 | K.V. Mounica | H.T.No.1117105741 |
| 574 | D. Sushmitha | H.T.No.1117102063 |
| 573 | Ch.Sneha Deepika | H.T.No. 1117106753 |
| 573 | A.Kavya | H.T.No.1117108433 |
| 572 | Vasundhra.N | H.T. No.1117107052 |
| 572 | Sk. Heena | H.T.No.1117103915 |
| 572 | B. Sravya | H.T.No.1117105745 |
| 572 | S.YUVA RAJESH | H.T. No.1117105326 |
| 571 | K.Mouna | H.T.No.1117106490 |
| 571 | K. B. Blessy | H.No.1117106834 |
| 571 | P. Sai Sandeep | H.T. No.1117112000 |
| 571 | T. Kavyamita | H.T.No.1117105291 |
| 570 | CH.Hema Krishna Manasa | H.T.No.1117103899 |
| 570 | P. Nissy Grace | H.T. No.1117111831 |
| 569 | G.Sireesha | H.T.No.1117108423 |
| 569 | A.Sai Srujana | H.T.No. 1117106524 |
| 569 | Ch. Hemanth Sai | H.T.No.1117101847 |
| 569 | S. Sai Teja | H.T. No. 1117111960 |
| 569 | K. Akash Reddy | H.T.No.1117105581 |
| 569 | G. Siva Swetha | H.T.No.1117103897 |
| 568 | Greeshma Rani. B | H.T. No. 1117108809 |
| 568 | Katta Mamatha | H.T. No.1119124066 |
| 568 | K. Saikiran | H.T. No. 1119123417 |
| 568 | P. Sai Supriya | H.T.No.1117102373 |
| 568 | MV. Bhageeratha | H.T. No.1117111897 |
| 568 | M. Vikas | H.T. No.1117111861 |
| 568 | G. Yashwanth | H.T. No.1117111867 |
| 568 | B.V. Sreeja | H.T.No.1117105525 |
| 568 | U. Rajesh Kumar | H.T.No.1117105485 |
| 568 | B. Nagarjuna Reddy | H.T.No.1117104501 |
| 567 | Hyma.K | H.T. No.1117107787 |
| 567 | V. Ramya Krishna | H.T. No.1117111935 |
| 567 | B.Y. Prakhya | H.T.No.1117105753 |
| 567 | A. Sai Harish | H.T.No.1117104477 |
| 566 | K. Naga Vinutha | H.T.No.1117104284 |
| 566 | S. Pravallika | H.T.No.1117104220 |
| 566 | G. Babu Shiva Chaitanya | H.T.No.1117105327 |
| 566 | CH.SAI SUSHMA | H.T. No.1117104947 |
| 566 | J. Shravya | H.T. No.1117111942 |
| 566 | D.Babuji | H.T.No.1117107511 |
| 566 | Yarlagadda Akhila | H.T. No.1119126032 |
| 566 | V. Abhishek Reddy | H.T.No.1117103026 |
| 565 | G.V. Sai Anudeep | H.T.No.1117103581 |
| 565 | K. Harshini Rani | H.T.No.1117101637 |
| 565 | JV. Prasanna Kumar | H.T. No. 1117111849 |
| 565 | M. G. Aishwarya | H.No.1117107304 |
| 565 | Deepthi.V | H.T. No.1117106776 |
| 565 | T. Amrutha | H.T.No.1117104473 |
| 565 | CH. Abhinav Kumar | H.T.No.1117105076 |
| 565 | K. Manoj | H.T.No.1117105701 |
| 564 | K. Naga Sai Sarvani | H.T.No.1117105751 |
| 564 | T. Mourya | H.T.No.1117101533 |
| 564 | Y. Rambabu | H.T.No.1117102116 |
| 564 | N. Madanmohan Reddy | H.T. No.1117111951 |
| 564 | N. Jansi | H.T. No.1117111883 |
| 564 | R. Bharath | H.T. No.1117111815 |

**Play Class to 10th Class English Medium only**

**డే స్కాలర్స్ మరియు రెసిడెన్షియల్ అడ్మిషన్లు ప్రారంభం**



# రత్నం హై స్కూల్స్

నెల్లూరు, ఆంధ్రప్రదేశ్

బ్రాంచీలు: / ఫోన్స్ :

| | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| హరనాథపురం | సరస్వతినగర్ | లక్ష్మీపురం | పెద్దబజారు | ఏ.సి. నగర్ | వేదాయపాలెం | పిడతాపోలూరు | ధనలక్ష్మీపురం | గూడూరు | కోవూరు | బుచ్చిరెడ్డిపాలెం | కావలి | తిరుపతి | మదనపల్లి | హైదరాబాద్ |
| 9866965577 | 9246433550 | 7702000050 | 7702000060 | 7702000054 | 9248048001 | 9248048099 | 9160610555 | 7702000063 | 7702333324 | 7702333324 | 8985271824 | 9246422032 | 9160612320 | 9299993039 |

# వారఫలాలు

*తేది 28-5-2011 నుండి 03-6-2011 వరకు వృషభంలో రవి; మేషంలో కుజ, బుధ, గురు, శుక్రులు; ధనుస్సు, వశ్చికాల్లో రాహువు; కన్యలో శని; మిథున, వృషభాల్లో కేతువు; మీన, మేష, వృషభ, మిథునాల్లో చంద్రుడు సంచరిస్తారు.*




సాధారణంగా ఆరోగ్యవిషయాల్లో పెద్ద ఇబ్బందులు లేకపోయినా బిపి రోగులు అధిక శ్రద్ధ తీసుకోవాలి. మానసికంగా ఇబ్బందులు తప్పవు. దాంపత్యసుఖంలో లోపం లేదు. నూతనమిత్రులు లభిస్తారు. వివిధమార్గాలలో ధనప్రాప్తి, రుణప్రాప్తి. కొన్ని వ్యవహారాల్లో మీ శ్రమ బూడిదలో పోసిన పన్నీరు మాదిరి వృథా అవుతుంది. లౌక్యం లేకుండా వ్యవహరించి చెడ్డపేరు తెచ్చుకొంటారు.




ఆరోగ్యసమస్యలు తీవ్రంగా ఉండవచ్చు. జీర్ణాశయ వ్యవస్థ బాగా దెబ్బ తింటుంది. కుటుంబ సమస్యలధికం. పరస్పర అవగాహన తగ్గుతుంది. ధనాదాయాలలో ఆటంకాలధికం. ఆర్థిక విషయాలంతంత మాత్రమే. ప్రయాణాలు కోరినరీతిలో జరుగవు. వ్యాపారులకు రాబడి తక్కువ. భాగస్వాములు మోసగిస్తారు. నూతన పెట్టుబడుల జోలికి పోవద్దు. రాజకీయులకు తీరని వేదన చోటుచేసుకొంటుంది.




అన్ని రంగాలలో విజయం, ఆరోగ్య సిద్ధి, అనుకూల ప్రయాణాలు కలుగుతాయి. విద్యార్థులకు ప్రయోజనవంతమైన కాలం. స్త్రీలు తమ ఆరోగ్యం పట్ల జాగ్రత్త వహించాలి. ఆర్థిక పరిస్థితులు చక్కగా వుంటాయి. తల్లి ఆరోగ్య లోపం ఆందోళనకరం. వ్యాపారులకు అంతంత మాత్రంగానే ఉంటుంది. వారం మొదట్లో ధనలాభం, కొత్త పెట్టుబడులు లాభిస్తాయి. ఉద్యోగులకు పరీక్షా కాలం.




పేగులకు సంబంధించి అనారోగ్య బాధ ఉంటుంది. రుణాలు తీరుతాయి. బ్యాంకు ఖాతాల్లో పెరుగుదల కానవస్తుంది. సాహసంతో చేపట్టిన పనుల్లో లాభం పొందుతారు. మాట తొందర కారణంగా ఇతరుల నుండి మాటపడతారు. ఉద్యోగులకు మేలైన కాలం. విద్యార్థులకు వృద్ధి, కొందరు ఇంటి విషయాలు పట్టించుకోకపోయినా సాంఘిక కార్యక్రమాల్లో క్రియాశీల పాత్ర పోషిస్తారు.




కన్ను, ఊపిరితిత్తులకు సంబంధించి ఇబ్బందులుండవచ్చు. కుటుంబంలో అశాంతి, అసౌఖ్యం ఉన్నా తాత్కాలికమే. వృత్తి వ్యాపారాలు బలోపేత మవుతాయి. సంతానం విషయంలో జాగ్రత్త అవసరం. దైవకార్యాల నిమిత్తం డబ్బు ఖర్చు చేస్తారు. ప్రణాళికాబద్ధమైన నడవడితో ముందుకు సాగుతారు. ఉద్యోగులు బడాబాబుల సాయంతో తమ కోరికలు తీర్చుకొంటారు. విద్యార్థులకు ఏకాగ్రత తగ్గుతుంది.




ఆంత్ర సంబంధిత బాధలుండవచ్చు. హృద్రోగబాధితులు జాగ్రత్తగా వుండాలి. మిత్రులు ఆర్థిక విషయాలలో మంచి సలహాలిస్తారు. పనులు నిదానంగా సాగవచ్చు. ఇంటిలో శుభకార్య నిర్వహణ. వ్యాపారులు ఖాతాదారుల నాడిని గమనించి తమ నష్టాలను ఈ వారంలో పూడ్చుకొంటారు. ఇంటిలో వివాహసంబంధ విషయాలు ప్రస్తావనకు వస్తాయి. రాజకీయులకు దురదృష్టకాలం.




తీవ్ర అనారోగ్య పరిస్థితులు నెలకొంటాయి. సోదర వర్గ బలం మీకు బాగా కలసివస్తుంది. పరోపకారతత్వంతో మెలుగుతారు. మెలకువగా వ్యవహరించండి. కొత్తవారితో పరిచయం కలుగుతుంది. నూతన రుణాలు లభిస్తాయి. వ్యాపారులకు భాగస్వాములతో గొడవలు. స్పెక్యులేషన్లు లాభిస్తాయి. రాజకీయ నాయకులు అసంతృప్తి, అసహనంతో వుంటారు. పిల్లల ఆరోగ్యం ఆందోళనకు గురిచేస్తుంది.




కుటుంబ వ్యవహారాల్లో సంయమనం పాటిస్తే మంచి ఫలితం వుంటుంది. ఆరోగ్య లోపముండదు. దీర్ఘరోగులకు ఊరట. కుటుంబ సమస్యలు తీరి ప్రశాంత వాతావరణం నెలకొంటుంది. ఖర్చులున్నా ఆదాయం బాగుంటుంది. బద్ధకాన్ని వదలి శ్రమ పడగలిగితే అందుకు తగిన ప్రతిఫలం తప్పక పొందుతారు. తలకు సంబంధించిన అనారోగ్య సూచనలున్నాయి. ముఖ్యులైన వ్యక్తుల్ని కలుసుకొంటారు.




పైత్య ప్రకోపం, నెమ్ము బాధలుంటాయి. తలపెట్టిన పనులు పూర్తవుతాయి. దైవక్షేత్ర సందర్శన సూచితమవుతున్నాయి. మీ మాటకు విలువ, గౌరవం పెరుగుతాయి. ఎదురుచూసిన ధనం అందుతుంది. నూతన పెట్టుబడులకు తగిన కాలం. కళాకారులకు ప్రోత్సాహం. వాదాల్లో జయం మీదే. కొత్తవారితో పరిచయాలు అవుతాయి. ఉదర సంబంధిత అనారోగ్యం తలెత్తే సూచనలున్నాయి.




అలర్జీ,కీళ్ళ బాధలు బాధిస్తాయి. అనుకూల ప్రయాణాలు, బంధుమిత్రుల కలయికతో ఉల్లాసంగా ఉంటారు. కుటుంబంలో ప్రశాంతత నెలకొంటుంది. కళాకారులకు, ప్రముఖులకు శుభవార్తలు అందుతాయి. ఉద్యోగులకు ఎదురుచూసిన ధనం అందుతుంది. విద్యార్థులకు మంచి కాలం కాదు. చక్కని వ్యవహార జ్ఞానంతో వివిధ రంగాల్లోని వ్యక్తులను ఆకర్షిస్తారు.




జీర్ణకోశం మరియు నరాలకు సంబంధించి బాధలుంటాయి. స్వల్ప మార్పు చేర్పులతో కార్యసిద్ధి, బిడియాన్ని వీడి చొరవగా దూసుకపోండి. వ్యవసాయదారులకు శ్రమాధిక్యత. సుఖసంతోషాలతో కాలక్షేపం చేస్తారు. వాహన కొనుగోలు నిమిత్తం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. వ్యవహార జయం, కొన్ని వ్యవహారాలలో మధ్యలో ఆటంకాలెదురైనా పట్టుదలగా వ్యవహరించి చివరకు జయం పొందుతారు.




ఆరోగ్యలోప సూచనలు లేవు. ఇతరుల వల్ల మోసపోయే సూచనలున్నాయి. ఆర్థికంగా లోటుండదు. పనుల్లో జాప్యం కలుగుతుంది. శుభకార్య యత్నాలు మొదలు పెట్టడానికి, నూతన పెట్టుబడులకు అనుకూల సమయం. వ్యాపారులకు పేరుతో బాటు ఆదాయం కూడా బాగుంటుంది. అనాలోచితంగా తీసుకొనే తొందరపాటు నిర్ణయాల వల్ల భవిష్యత్తులో ఇబ్బందులు ఎదుర్కొంటారు.

## పంచాంగం

29 తేది కర్తరీ త్యాగం.
31తేది కృష్ణాంగారక చతుర్దశి.

### శుభ ముహూర్తాలు

28, 29, 3 తేదీల్లో కర్కాటక లగ్నాన ఉ.08.30 నుండి 10.30 గంటల వరకు.
28, 29, 3 తేదీల్లో సింహ లగ్నాన ఉ.11.30 నుండి 1.00గంట వరకు శుభ ముహూర్తాలున్నాయి.

### మే తిథులు

**వైశాఖ బహుళ**

| | | | |
|---|---|---|---|
| 28 | శని | ఏకాదశి | రా 07.55 గం.ల.వ |
| 29 | ఆది | ద్వాదశి | రా 09.54 గం.ల.వ |
| 30 | సోమ | త్రయోదశి | రా 11.30 గం.ల.వ |
| 31 | మంగ | చతుర్దశి | రా 12.52 గం.ల.వ |

### జూన్ తిథులు

| | | | |
|---|---|---|---|
| 01 | బుధ | అమావాస్య | రా 01.57 గం.ల.వ |

**జ్యేష్ఠ శుద్ధ**

| | | | |
|---|---|---|---|
| 02 | గురు | పాడ్యమి | తె 02.22 గం.ల.వ |
| 03 | శుక్ర | విదియ | తె 02.20 గం.ల.వ |

**పి.ఎం.గోపాలాచారి**
16/1020, పొగతోట, నెల్లూరు – 1.
E-mail:maripmgg@yahoo.com

# సంస్మరణ







జననం
21-09-1918

మరణం
29-05-1997





## శ్రీ గునుపాటి రామచంద్రారెడ్డి గారు

మాజీ శాసనమండలి సభ్యులు

పరమపదించి 29-05-2011 నాటికి పద్నాలుగు సంవత్సరాలు పూర్తవుతాయి.

**14వ వర్ధంతి**



సందర్భంగా వారి పవిత్రాత్మకు శాంతిని కలుగజేయమని భగవంతుని ప్రార్థిస్తూ శ్రద్ధాంజలి ఘటిస్తున్నాము.



**కుటుంబసభ్యులు**

# సంతోషంగా వున్నాను!



తాను ఒంటరి అనే భావన ఎప్పుడూ కలుగలేదంటుంది అందాల భామ సుస్మితాసేన్. ఆమెకిప్పుడు 35 ఏళ్లు. ఇంకా పెళ్లి చేసుకోలేదు. ముగ్గురితో ప్రేమాయణం సాగించిందని బాలీవుడ్‌లో అంటుంటారు. ఈ విషయమై సుస్మితా అసలు స్పందించదు. నా వృత్తిగత జీవితం, వ్యక్తిగత జీవితం వేర్వేరు. నాకేదో వయస్సై పోతోంది, ఎవరినో ఒకరిని పెళ్లి చేసుకోవాలనే తొందర నాకేమీ లేదు. నాకంటూ జీవితంలో అంతులేని ఆనందాన్నిచ్చే ఇద్దరు పెంపుడు పిల్లలున్నారు. ఆ చిన్నారులతో నేను అనుభవించే ప్రతిక్షణం మధురమే. ఆ ఆనందాన్ని మాటల్లో చెప్పలేనంది.

# హీరోయిన్ మారాలి!



నటనాపరంగా కథానాయిక ప్రతి చిత్రానికీ మార్పు చూపించాల్సిందే అంటుంది హీరోయిన్ జెనీలియా. తెలుగుతోపాటు తమిళ, హిందీ భాషల్లో నటిస్తున్న ఈ భామ యాక్షన్ అంశాలు ముడిపడ్డ పాత్రలకైనా సిద్ధమంటుంది. ఈ మధ్య తాను మళయాళ చిత్రం 'ఉర్మి' కోసం కత్తి యుద్ధం నేర్చుకొన్నానంది. మార్షల్ ఆర్ట్స్‌లో స్వల్పకాలిక శిక్షణ కూడా పొందానంది. ఆ చిత్రం నటిగా తనకెంతో సంతృప్తినిచ్చిందంటుంది. వేలాయుధమ్ అనే తమిళ చిత్రంలో పాత్రికేయురాలి పాత్ర పోషించానంది. కమర్షియల్ సినిమా అన్నాక అక్కడక్కడా గత చిత్రాల తాలుకు ప్రభావం నటనపై కనపడ్డా మార్పు చూపించను తాను ప్రయత్నిస్తుంటానంటుంది జెనీలియా.



# కోటి పలుకుతున్న కాజల్

మగధీర, డార్లింగ్, బృందావనం, మిస్టర్ పర్‌ఫెక్ట్ చిత్రాలు హీరోయిన్ కాజల్ రేంజ్‌ను పెంచేశాయి. ప్రస్తుతం ఆమె రవితేజతో వీర, నాగచైతన్యతో మరో చిత్రంలో నటిస్తుంది. ఇంకా పలు ఆఫర్లు ఆమె చేతిలో వున్నాయి. హిట్స్ వుండగానే రేటు పెంచాలని డిసైడ్ అయిన కాజల్ తన పారితోషికం అమాంతంగా పెంచేసింది. కోటి రూపాయలకు పైగా పారితోషికం కావాలని కాజల్ డిమాండ్ చేస్తుండడంతో సక్సెస్ బాటలో వున్న ఆమెకు అడిగినంత ఇవ్వను నిర్మాతలు సిద్ధపడుతున్నారు. వీర హీరోయిన్‌గా తన స్థాయిని ఇంకా పెంచుతుందంటుంది కాజల్.

# ముద్దివ్వలేను!



మాటను మర్మం లేకుండా మాట్లాడే అతి కొద్దిమంది తారల్లో ప్రియాంకాచోప్రా ఒకటి. ఇటీవల హైదరాబాద్ వచ్చిన ఆమె పిచ్చాపాటీగా మాట్లాడింది. ఫలానా పాత్రలను చేయనని గిరిగీసి కూర్చోవడం నటీమణులకు కుదరని పని. అయినా ఎవరికివారు ఈ విషయంలో కొన్ని నిషేధాలు ఏర్పరచుకోవాలి. నా వరకు వస్తే నటిగా నేను స్క్రీన్‌పై సౌకర్యవంతంగా కన్పించాలి. కుటుంబసభ్యులతో హాయిగా కూర్చొని నేను నటించిన సినిమాలు చూడగలగాలి. తెరపై అబ్బాయిల్ని ముద్దుపెట్టుకోవాలంటే నాకు సంబంధించి బోల్డన్ని సమస్యలున్నాయి. ముద్దు పెట్టాలని కవ్వించే స్థాయిగల యువకుడు తారసపడలేదు. అయినా నాకు ఇప్పుడు తెరపై ముద్దిచ్చే మూడ్ లేదని తేల్చి చెప్పింది ఈ అందాల భామ.

# మనసుకు నచ్చినోడేడి?



తీన్‌మార్‌లో తన పాత్రకు ముద్దుపెట్టక తప్పని పరిస్థితని అందువల్లే హీరో పవన్‌కళ్యాణ్‌కు ముద్దు పెట్టానంటుంది హీరోయిన్ త్రిష. తీన్‌మార్ చిత్రంలో నా నటనను పలువురు మెచ్చుకొన్నారు. అంతకంటే ఏం కావాలంటుంది. మనసుకు నచ్చిన మగాడు కానరాలేదని, కనిపిస్తే డేటింగ్‌కు సిద్ధంగా వున్నానంది. తాను ఎంత బిజీగావున్నా కాలంతోపాటు పరుగెడుతున్నా వీలు చేసుకొని స్నేహితులతో గడపడానికి ఇష్టపడతానంది. చెన్నైలో నాకు చాలా మంది ఫ్రెండ్స్ వున్నారు. అందరం ఓ గ్యాంగ్‌గా కలిసి అల్లరి చేస్తుంటామని త్రిష తన మనసులో మాట చెప్పుకొచ్చింది.

# సాదాసీదా 'వీర'



✍ అల్లూరు రహీం

ఒక ఊరిలో, రైడ్ చిత్రాలను తీసిన యువదర్శకుడు రమేష్‌వర్మ మాస్ హీరో రవితేజను దృష్టిలో పెట్టుకొని తయారు చేసిన కథతో తీసిన చిత్రం 'వీర' గందరగోళంగా తయారయ్యింది. పూర్వాశ్రమంలో పబ్లిసిటీ డిజైనర్ అయిన రమేష్‌వర్మ అనుభవరాహిత్యం ఈ చిత్రంలో చాలా చోట్ల కానవస్తుంది. వాస్తవంగా వీర చిత్రం కథను, కాస్త ట్రీట్‌మెంట్ చేస్తే బాగుండేది. కాని దర్శకుడు ఇద్దరు హీరోయిన్లు కాజల్, తాప్సీ అందాల ప్రదర్శన, బూతు మాటలు, పాటలపై పెట్టిన శ్రద్ధను చిత్రంపై పెట్టలేకపోయాడు. ఈ చిత్రంలో ప్రతి రీలుకు ఒకసారి తెరపై మాటలు ఆగిపోతాయంటే ఎంత బూతును మహా రచయితలు పరుచూరి బ్రదర్స్, అబ్బూరి రవి కుమ్మరించారో అర్థం చేసుకోవచ్చు. పాటల్లో కూడా భాస్కర్‌భట్ల, సిరాశ్రీ, రెహమాన్ బూతును దట్టించేశారు. ఇంతచేసినా ద్వితీయార్థం బలహీనమై చిత్రాన్ని చూడకుండా చేసి పారేసింది. అయితే బ్రహ్మానందం – రవితేజ కాంబినేషన్‌లోని కామెడీ బాగా పేలింది. టైగర్ అప్పారావుగా ఈ చిత్రంలో బ్రహ్మానందం చాలా హుషారుగా నటించాడు. పాత హీరోయిన్ దివ్యవాణి విలన్ భార్యగా చూపించిన విలనీయం బాగుంది. కేవలం పది రోజుల్లో ఈ చిత్రానికి సంగీతం సమకూర్చానని చెప్పిన సంగీత దర్శకుడు ధమన్ తాను పాటలో మాట వినపడకుండా చేసిన తీరును ఒకసారి సమీక్షించుకొంటే బాగుంటుంది. ఎక్కడెక్కడున్నాడో, ఓమేరీ సామ్‌నే, ఏక్‌బార్ పాటల్లో తాప్సీ రెచ్చిపోయి అందాల ప్రదర్శన చేసింది. ఆమెకు తానేమాత్రం తక్కువకాదని కాజల్ ఓసే నా చిట్టి, ఓ సన, మావిళ్లతోట కాడ పాటల్లో రెచ్చిపోయింది. పాత డ్రైవర్ రాముడు చిత్రంలోని మావిళ్లతోట పాట రీమిక్స్ రికార్డు డ్యాన్స్‌ను తలపింపజేసింది. పరుచూరి బ్రదర్స్ వ్రాసిన మాటల్లో దేవుడంటే రూపం కాదు గుణం, ఇష్టమైన వాళ్లను తలచుకొంటే బాధ మాయం, జనం కోసం బతకడం జనం కోసం చావడం ఆనందం బాగున్నాయి. దర్శకుడు పబ్లిసిటీ డిజైనర్ అవడం వల్ల పాటలను కలర్‌ఫుల్‌గా చిత్రీకరించాడు. దీన్లో సీనియర్ కెమెరామెన్ చోటా కె నాయుడు శ్రమ కూడా ఎంతో వుంది. రామ్ – లక్ష్మణ్ వీర కోసం సృష్టించిన పోరాటాలు మాస్‌ను విపరీతంగా ఆకర్షిస్తాయి.

చిత్ర కథలోనికి వెళ్తే ఏసిపి శ్యామ్‌సుందర్(కిక్ శ్యామ్)పై మాఫియా నేత ధన్‌రాజ్ దాడి చేసి ఆయన కొడుకు మోక్షను చంపేస్తారు. కానీ ఈ విషయం ఏసిపి కుటుంబసభ్యులకు చెప్పడు. తీవ్రంగా గాయపడిన ఏసిపికి బాడీగార్డ్‌గా దేవా(రవితేజ) వస్తాడు. కాని దేవాను చూసి ఏసిపి సతీమణి సంధ్య(శ్రీదేవి) అసహ్యించుకొంటుంది. ఏసిపి వాళ్ల పాపను రోజూ స్కూల్‌కు తీసుకవెళ్తుండే దేవాకు వాళ్ల ఇంటి ప్రక్కనుండే ఐకి(తాప్సీ) పరిచయమవుతుంది. ఆమె దేవాను వూహించుకొని పాటల లోకంలో విహరిస్తుంది. కోలుకున్న ఏసిపి ఆఫీసుకెళ్లి ఫైల్ చూడగా తన ఇంటికి సెక్యూరిటీగా వచ్చిన దేవా అసలు దేవా కాదని తెలుసుకొంటాడు. ఇంతలో ఏసిపి కుటుంబం బ్రతికున్నాడనే భ్రమలోనే మోక్షను చూడను బయలు దేరుతుంది. మార్గమధ్యలో వీరిపై ధన్‌రాజ్ బృందం దాడి చేయబోగా వచ్చి అడ్డుకొన్న దేవాను ప్రత్యర్థులు కాల్చివేస్తారు. కొనఊపిరితో వుండే అతనికి డాక్టర్ కూడా అయిన సంధ్య ఆపరేషన్ చేస్తుంది. అతను దేవా కాదని తన సోదరుడు వీర వెంకట సత్యనారాయణ అని చెప్పి వెక్కి వెక్కి ఏడుస్తుంది. కథ గ్రిరున సదాశివపురం వెళ్తుంది. ఆ గ్రామంలో మకుటంలేని మహారాజు సూర్యప్రతాప్ నాయుడు (నాజర్) కుమారుడే వీర వెంకట సత్యనారాయణ (రవితేజ). ఆయన మొదటి భార్యకు ఇద్దరు మగ పిల్లలు. రెండో భార్య భాను(రోజా) కుమార్తె సంధ్య. భానుకు సూర్యప్రతాప్ నాయుడు రాజకీయాల్లో వుండడం ఇష్టముండదు. అతనికి దూరంగా వుంటుంది. ఇంతలో ప్రత్యర్థులు సూర్యప్రతాప్ నాయుడిని హత్య చేస్తారు. నాన్న నుంచి గ్రామపెత్తనం తీసుకొనే వీరవెంకట సత్యనారాయణకు, ప్రక్క గ్రామంలోని పెద్ద వెంకట్రాయుడు (ప్రదీప్ రావత్)కు గొడవ పడుతుంది. అతను వెంకటసత్యనారాయణ ఊర్లో లేని సమయంలో ఆయన భార్య చిట్టి (కాజల్) తోపాటు బంధుమిత్రులందరినీ ఊచకోత కోస్తాడు. తప్పించుకొని తిరుగుతుండే ఇతని ఆచూకీ వీరవెంకట సత్యనారాయణ తెలుసుకొని అంతమొందించడంతో సినిమా ముగుస్తుంది.

చిత్ర సమీక్ష

ప్రేమ, వినోదం, యాక్షన్ కలగలిసిన చిత్రాల్లో నటన రవితేజకు కొట్టిన పిండి. ఈ చిత్రంలో ఆయన బాగానే నటించాడు. కాజల్, తాప్సీలు వీరలో అందాల బొమ్మలే. స్క్రీన్‌ప్లేలో సమతూకం లోపించడం వీరకు శాపంగా మారింది. దీనికి దర్శకుడే బాధ్యత వహించక తప్పదు. 

● పాతబాట నడవని

# రామచంద్రారెడ్డి హాస్పిటల్!



నెల్లూరులోని రామచంద్రారెడ్డి ప్రజావైద్యశాల.

బడుగు, బలహీన వర్గాలకు వైద్యం అందుబాటులో వుంచాలన్న లక్ష్యంతో నెల్లూరు శంకర అగ్రహారంలో ఏర్పాటుచేసిన డాక్టర్ రామచంద్రారెడ్డి ప్రజావైద్యశాల పేద ప్రజలకు అందుబాటులో లేకుండా పోతోంది. ఒక్క డాక్టర్ సలహా ఫీజు మినహా రక్త పరీక్షలు, ఎక్స్‌రే, ఇసిజి, ఎకో పరీక్షలు, ఆపరేషన్లు, రూముల బాడుగలు కార్పొరేట్ ఆసుపత్రుల మాదిరి వసూలు చేస్తున్నారు. గతంలోలా కాకుండా అవసరమైన దానికంటే ఎక్కువగా మందులు రాసిస్తున్నారు. డాక్టర్ జెట్టి శేషారెడ్డి మరణం తర్వాత ఆసుపత్రి కమర్షియల్ బాటలో నడుస్తున్నా ఇటు సిపిఎం పార్టీ కానీ, అటు ఆసుపత్రి కమిటీ సభ్యులుకానీ పెద్దగా పట్టించుకోకపోవడం విమర్శలకు తావిస్తుంది. ఆసుపత్రిని డాక్టర్ రామచంద్రారెడ్డి స్థాపిస్తే డాక్టర్ శేషారెడ్డి, డాక్టర్ రమణారెడ్డి, డాక్టర్ ప్రభాకర్‌రెడ్డి, డాక్టర్ వింధ్యావాణి దీని అభివృద్ధికి అలుపెరగక శ్రమించి పేరుకు తగ్గట్టే ప్రజావైద్యశాలను చేశారు. డాక్టర్ శేషారెడ్డి, డాక్టర్ రమణారెడ్డిలను ఆదర్శంగా తీసుకొని స్వర్గీయ డాక్టర్ ఎస్వీఎస్ ప్రసాద్, డాక్టర్ విజయకుమార్, డాక్టర్ రవీంద్ర కూడా ఆసుపత్రిలో ప్రజావైద్యులుగా మన్ననలు పొందారు. ఇటీవల వరకు స్థాపకుల్లో ఒకరైన డాక్టర్ జెట్టి ప్రభాకర్‌రెడ్డి ఆసుపత్రి కమిటీ మెంబర్‌గా వుండినారు. ఈ మధ్య కొన్ని అనారోగ్య కారణాల వల్ల మీటింగులకు వెళ్లలేదని ఆయన్ను కమిటీ నుంచి తొలగించివేసినట్లు తెలిసింది. డాక్టర్ ప్రభాకర్‌రెడ్డిని తొలగించడం విమర్శలకు దారితీసినా సరిదిద్దేవారే లేకుండా పోయారు. ఎంత తక్కువగా అంచనావేసినా రామచంద్రారెడ్డి హాస్పిటల్ విలువ వంద కోట్ల రూపాయల పైమాటే. ఈ హాస్పిటల్ అభివృద్ధికి ఎంతో మంది సిపిఎం సానుభూతిపరులు విరాళాలు ఇచ్చారు. అభివృద్ధి కోసం డాక్టర్లు, నర్సులు, కాంపౌండర్లు, సిపిఎం పార్టీలోని అన్ని శ్రేణుల్లోని నాయకులు శ్రమించారు. రామచంద్రారెడ్డి ప్రజావైద్యశాలను పాత రోజుల మాదిరి ప్రజలకు అందుబాటులో వుండేలా నడపడానికి ప్రస్తుత కమిటీ, డాక్టర్లు ప్రయత్నించాల్సిన అవసరం ఎంతైనా వుంది.

# అయ్యో పాపం కిరణ్!

ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్ రెడ్డి పరిస్థితి చూస్తే ప్రత్యర్థి పార్టీల వారికి కూడా అయ్యోపాపం అన్న జాలి కల్గుతున్నది. పది కోట్ల మంది ప్రజలు, లక్ష కోట్ల రూపాయల బడ్జెట్ కల్గిన రాష్ట్రానికి ముఖ్యమంత్రి అంటే మాటలు కాదు. పూర్వ జన్మ సుకృతం ఏదో వుంటే తప్ప దక్కని భాగ్యం అది. కానీ కిరణ్‌కు పదవి దక్కింది కానీ,దాని భోగం మిగలడం లేదు. అసలే ఆయన పాలన అంతంత మాత్రం. ఏ నిర్ణయమూ తీసుకోకుండా నెట్టుక రావడంలో పివి.నరసింహారావును మరపిస్తున్నాడు. దానికి తోడు కడప ఉప ఎన్నికలో తీవ్ర అవమానం తర్వాత అటు మంత్రులకు, ఇటు ఐఎఎస్ అధికారులకు కూడా అలుసైపోయింది. ఒక్క ఐఎఎస్ అధికారి కూడా ముఖ్యమంత్రి చెప్పిన పని చేయడం లేదు. తమ తమ శాఖల మంత్రులనైతే గుడ్డి గుర్రాల కంటే హీనంగా చూస్తున్నారు. ఈ ప్రభుత్వం ఎన్ని రోజులు వుంటుందో తెలియదు, దానికి అధిష్టానం మద్దతు లేదు, ప్రజలు విశ్వాసం అసలే లేదు. అటువంటి ప్రభుత్వంలోని మంత్రులను నమ్ముకొని వారు చెప్పిన పనులు చేస్తే రేపు తమను కాపాడే దిక్కు ఎవరన్నది ఐఎఎస్ అధికారుల భావన. వైఎస్ వున్నప్పుడు, ఎంత ప్రమాదం ఎదురైనా ఆయన భరించే వాడు. అధికారుల మీద ఈగ వాలనిచ్చే వాడు కాదు. కానీ ఇప్పుడు అంత భరోసా ఇచ్చే వారు లేకపోవడంతో ఐఎఎస్ అధికారులు ఫైళ్ల మీద సంతకాలు పెట్టాలంటే సంకోచిస్తున్నారు. అధికారుల మద్దతు,సహకారం లేకుండా ఏ ప్రభుత్వమూ నడవదు. కిరణ్‌కు ఇప్పుడది పెద్ద సమస్యగా వుంది. దాన్ని పరిష్కరించుకోవాలంటే తన ప్రభుత్వం నాలుగు కాలాల పాటు నిలుస్తుందని, ఢిల్లీ కాంగ్రెస్ పెద్దలు తన ఆపదకు అడ్డు వస్తారని నమ్మకం కల్గించాలి. అది జరగాలంటే ఆయన సాహసోపేత నిర్ణయాలు తీసుకోవాలి. కానీ కిరణ్‌కు అంత సమర్థత లేదన్నది అందరి అభిప్రాయం. ఎంతో పుణ్యం చేసుకొంటే తప్ప లభించని రాజకీయ భాగ్యాన్ని ఆయన చేజేతులా వృధా చేసుకొంటున్నారు.




## కాంగ్రెస్‌కొక నాయకుడు కావాలి!

మొదటి పేజీ కొరవ

రెడ్డికి పనులు చేయడం తెలియదు. ఎమ్మెల్యేలు వస్తే మాట్లాడడం తెలియదు. ఆయన దగ్గరకు వెళ్లి దండగ అనే నిరాశ దాదాపుగా అందరు ఎమ్మెల్యేలలో కన్పిస్తున్నది.

పిసిసి అధ్యక్షత, శాసనసభ స్పీకర్, శాసన మండలి ఛైర్మన్, ఉప ముఖ్యమంత్రి వంటి పదవులు చాలా ఖాళీగా వున్నాయి. వాటిని నింపాలి. కానీ ఎవరో ఒకరిని పిలిచి పదవులు ఇచ్చినంత మాత్రాన వచ్చే లాభం ఏమీ లేదు. ఆ పదవులతో వారు అధికార భోగం అనుభవిస్తారు తప్ప పార్టీకి ఉపయోగపడరు. అట్లని ఆ ఖాళీలను ఎంతోకాలం అట్లనే వదలి పెట్టనూ లేరు.

కాంగ్రెస్ అధిష్టానానికి ఇంత తలనొప్పి వ్యవహారం మరే రాష్ట్రంలోనూ లేదు. ఢిల్లీ పెద్దలు ఇప్పుడు ఏదో ఒక నిర్ణయం తీసుకోక తప్పని సమయం ఆసన్నమైంది. అయితే కాంగ్రెస్ పునరుజ్జీవానికి ప్రయత్నం చేయాలి. కాకుంటే ఎటూ ఆంధ్రప్రదేశ్‌లో కొంత కాలం కాంగ్రెస్‌కు పుట్టగతులు వుండవన్న వాస్తవాన్ని అంగీకరించి, కనీసం పార్టీ క్రమశిక్షణ అయినా కాపాడుకోవాలి. ఈ రెండింటిలో ఏది ఎంచుకోవాలో అర్థం కావడం లేదు.

### జగన్ తల దువ్వుతారా?

ఒకప్పటి రాష్ట్ర వ్యవహారాల ఇన్‌ఛార్జి, మధ్యప్రదేశ్ మాజీ ముఖ్యమంత్రి దిగ్విజయ్ సింగ్ ఇందుకొక పరిష్కారం సూచించాడట. జగన్‌ను బుజ్జగించి మళ్లీ పార్టీలోకి తెచ్చుకోవడం ఒక్కటే ఈ సమస్యకు పరిష్కారమని సోనియా గాంధీకి సూచించాడట. అందుకామె ఏమి స్పందన చూపిందో తెలియదు కానీ ఆయన మాత్రం జగన్ శిబిరంలోని ఒక ముఖ్యుడికి వర్తమానం పంపాడు, వచ్చి తనను కలవమని. అయితే అందుకు జగన్ ఎంతమాత్రం సిద్ధంగా లేడని సమాచారం. కడప ఎన్నికలలో ఐదున్నర లక్షల భారీ మెజార్టీ రావడానికి కారణం, తానొక పోరాట యోధుడనని ప్రజలు నమ్మడమే అని, ఇప్పుడు ఢిల్లీతో రాజీపడితే ఆ విశ్వాసం క్షీణించి, జనం తనను ఛీత్కరించుకొంటారని స్పష్టంగా చెప్తున్నాడు జగన్. కాంగ్రెస్ గూటిలో చేరి వారు వేసే ముష్టి ఏరుకోవలసిన గతి తనకు లేదని, దర్జాగా ఎన్నికలలో ముఖ్యమంత్రి పదవి తన ఇంటికే నడచి వస్తుందని ఆయన నమ్ముతున్నాడు.

పిసిసి అధ్యక్షుడు డి.శ్రీనివాస్ కూడా జగన్‌ను కలుపుక పోవడం కంటే పార్టీకి మార్గాంతరం లేదని, ఆయన్ను వైఎస్ కుమారుడిగా కాక, స్వంతంగా ఎదిగిన ఒక నేతగా గుర్తించక తప్పదని వాదిస్తున్నాడు. జగన్‌ను వెంటబెట్టుకొంటే తప్ప కాంగ్రెస్‌కు భవిష్యత్తు లేదని తేల్చి చెప్తున్నాడు.

### లేదంటే జైలుకు?

జగన్ తమ మాట విని కాంగ్రెస్‌తో చేతులు కలిపితే సరే, లేదంటే ఆయన్ను జైలుకు పంపించి ఆయన రాజకీయ ప్రాభవాన్ని పతనం చేయాలని ఒక వర్గం కాంగ్రెస్ వాదులు ఢిల్లీలో ప్రచారం చేస్తున్నారు. కరుణానిధి కుమార్తె కనిమొళినే జైలుకు పంపినప్పుడు జగన్ విషయంలో ఊగిసలాట ఎందుకన్నది వీరి వాదన. అయితే కడప ఉప ఎన్నిక తర్వాత అటువంటి ప్రయత్నం చేస్తే ప్రజలలో తిరుగుబాటు వచ్చి, జగన్ మరింత పెరిగి పోతాడేమో అన్న భయం కూడా వుంది.

మొత్తానికి కాంగ్రెస్ పార్టీకి ఇప్పుడొక నాయకుడు కావాలి. పార్టీని నడిపించే పెద్ద దిక్కు కావాలి. కానీ ఆ కొరత తీరే మార్గం మాత్రం సమీప భవిష్యత్తులో కన్పించడం లేదు.

## జనవాణి

2వ పేజీ కొరవ

### కుక్కలను పట్టండి!

నెల్లూరు నగరంలో వీధి కుక్కలు విపరీతంగా పెరిగిపోయాయి. పగలు, రాత్రి తేడా లేకుండా నడిచి వెళ్లేవారిని, ద్విచక్ర వాహనాల్లో వెళ్లేవారిని వెంటబడి కరుస్తున్నాయి. కుక్క కరిస్తే చేయించాల్సిన వ్యాక్సిన్ కొరత తీవ్రంగా వుంది. ఎవరో ఒక వ్యక్తి తెచ్చిన స్టేను ఆధారం చేసుకొని కార్పొరేషన్ కుక్క కాట్లకు ప్రజలు గురి కావాలని వదలివేయడం దారుణం.

కె.సులోచన నెల్లూరు

## నెల్లూరు ముచ్చట్లు

3వ పేజీ కొరవ

రించుకొని 19తేది 39వ డివిజన్‌లోని సిపిఎం పార్టీ కార్యకర్తలు డైకస్‌రోడ్డు సెంటర్‌లో మజ్జిగ చలివేంద్రాన్ని ఏర్పాటు చేశారు. దీన్ని సిపిఎం జిల్లా కమిటి సభ్యుడు ఎస్.మురళీకృష్ణ ప్రారంభించి మాట్లాడుతూ... సుందరయ్య తన జీవితాంతం పీడిత ప్రజల పక్షాన అవిశ్రాంత పోరాటం చేశారు. పార్లమెంటులో మొట్టమొదటి ప్రతిపక్షనేత అయిన ఆయన సైకిల్‌పై పార్లమెంటుకు వెళ్లిన ఆదర్శ నాయకుడని పేర్కొన్నారు. తన ఆస్తి మొత్తం పార్టీకి పేద ప్రజలకు ధారదత్తం చేసి తుదిశ్వాస వరకు పార్టీ కోసం కృషి చేశారన్నారు. ఈ కార్యక్రమంలో 39వ డివిజన్ పార్టీ కార్యదర్శి ఎం.డి. గఫార్, షేక్ ఖలీద్, అమీర్ బాష, జహీర్, అహ్మద్, షేర్‌ఖాన్, ఫయాజ్ తదితులు పాల్గొన్నారు.

### పేద బ్రాహ్మణులకు స్కాలర్‌షిప్పులు!

ఆర్థికంగా వెనుకబడిన పేద బ్రాహ్మణ విద్యార్థినీ, విద్యార్థుల వున్నత చదువుల కోసం పేద బ్రాహ్మణ ఉన్నత విద్యా సహాయక ట్రస్ట్ ఆర్థిక సహాయం అందించను ముందుకొచ్చింది. ఆసక్తి గల విద్యార్థులు తాము ఉత్తీర్ణులైన ఆఖరు పరీక్ష మార్కుల జాబితా, చేరవలసిన తరగతి, చెల్లించవలసిన రుసుం, ఇత్యాది వివరాలతో నెల్లూరు తిప్పరాజు వెంకటసుబ్బయ్య సత్రంలో దరఖాస్తు పూర్తి చేసి ఇవ్వాలి. ఇతర వివరాలను డాక్టర్ సర్వేపల్లి అజయ్‌కుమార్, రాళ్లపల్లి రామసుబ్బారావులను 98482 51504, 99082 69665 ఫోను నెంబర్లలో సంప్రదించవచ్చు.

### పట్టుదలతో పాసైన మైథిలి

తీవ్రమైన మూత్రపిండాల వ్యాధితో బాధపడుతూ పదవ తరగతి పరీక్ష వ్రాసిన మైథిలి బి2 గ్రేడ్‌లో ఉత్తీర్ణురాలైంది. నగరానికి చెందిన ఈ చిన్నారి గత కొంతకాలంగా మూత్రపిండాల వ్యాధిలో బాధపడుతోంది. ఎస్ఆర్‌కె పాఠశాలలో చదువుతూ మధ్యలో అనారోగ్యంతో పాఠశాలకు వెళ్లలేక పోయింది. పట్టుదలతో సహాయకుడితో పరీక్ష వ్రాసి మంచి మార్కులు తెచ్చుకోవడం ఆ అమ్మాయి తల్లిదండ్రులకు సంతోషం కల్గించింది.

### కుటుంబ న్యాయస్థానం ఎపిపిగా అరుణకుమారి

నెల్లూరు అదనపు ఫ్యామిలీ కోర్టు అడిషినల్ పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా రామిశెట్టి అరుణకుమారిని నియమిస్తూ ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది. 19తేది ఈమె ఆ బాధ్యతలు స్వీకరించారు. అరుణ కుమారి స్వగ్రామం అల్లూరు. ఈమె ప్రముఖ న్యాయవాది సోడే నాగేశ్వరావు సతీమణి. ఎపిపి పదవిలో మూడేళ్లుంటారు.

### బ్యాంక్ డైరెక్టర్ల స్టడీటూర్

కేంద్ర సహకార బ్యాంకు డైరెక్టర్లు 25 మంది కేరళ రాష్ట్రానికి స్టడీటూర్‌కు వెళ్తున్నారు. ఎర్నాకులం, కేరళ తదితర ప్రాంతాలో పర్యటించి అధ్యయనం చేస్తారట. 28తేది నుంచి జూన్ 3వరకు ఈ టూర్ వుంటుందని బ్యాంకు ఛైర్మన్ శ్యాంసుందర్ రెడ్డి చెప్తున్నారు.

### కార్పొరేషన్ ఆఫీసులో త్రాగునీటి సమస్య

క్రొత్తగా అన్ని హంగులతో రూపుదిద్దుకొన్న కార్పొరేషన్ కార్యాలయంలో మంచినీటికి ఉద్యోగులు కటకటలాడాల్సిన పరిస్థితి ఎదురౌతోంది. ఈ భవనం మొదటి అంతస్థులో ఒక్క మంచినీటి కూలర్‌నే ఏర్పాటు చేయడంతో వివిధ అంతస్థుల్లో విధులు నిర్వహించే సిబ్బంది క్రిందికి వచ్చి నీళ్లు పట్టుకోవాల్సి వస్తుండడంతో ఇబ్బంది పడుతున్నారు.

### తాటిచెట్టు నీడన...

క్రొత్త కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి జిల్లాలో విస్తృతంగా పర్యటిస్తూ వివిధ పథకాల అమలు తీరును పరిశీలిస్తున్నారు. ఈ వారం దగదర్తి వెళ్లిన ఆయన అక్కడ ఉపాధి పనులను చేస్తున్న కూలీలతో ముచ్చటించారు. ఈ సమయంలో ఎండ ఎక్కువగా వుండడంతో తాటిచెట్టు వద్ద నిలబడి షుమారు 40 నిమిషాలు కూలీలతో మాట్లాడి వారి సమస్యలు అడిగి తెలుసుకున్నాడు. కలెక్టర్ ఇలా ఎండలో నిలబడి మాట్లాడడంతో ప్రజలు ఎంతగానో సంతోషించారు.

# పదవ తరగతి పరీక్షా ఫలితాల్లో... నెల్లూరు విద్యార్థుల ప్రభంజనం!




అత్యధిక మార్కులు తెచ్చుకొన్న తమ స్కూలు విద్యార్థి నాగరిషితను అభినందిస్తున్న లిల్లీ లిటిల్ ఫ్లవర్ స్కూల్ కరస్పాండెంట్ ఇ.సి.నారాయణరెడ్డి.

## లిల్లీ లిటిల్ ఫ్లవర్‌లో ప్రతిభా సుమాలు!

వేదాయపాళెంలో గల లిల్లీ లిటిల్ ఫ్లవర్ విద్యార్థులు పదవ తరగతి పరీక్ష ఫలితాల్లో చక్కని ప్రతిభ కనబరచారు. యు.నాగరిషిత 578 మార్కులు, శ్రావ్య 567, నీరజ 566 మార్కులు పొందారని స్కూలు కరస్పాండెంట్ ఇసి నారాయణరెడ్డి చెప్పారు. తెలుగు మీడియంలో ఫణీష్ 556, ప్రదీప్ 554 మార్కులు సాధించార న్నారు. మొత్తం 102 మంది విద్యార్థులు పరీక్షకు హాజరుకాగా 18 మంది 550 మార్కులు, 52 మంది 500 మార్కులు పొందారన్నారు.




అత్యధిక మార్కులు తెచ్చుకొన్న రవీంద్ర భారతి హైస్కూలు విద్యార్థులను పాత్రికేయులకు పరిచయం చేస్తున్న స్కూలు నిర్వాహకులు.

## రత్నం హైస్కూల్‌లో స్టేట్ టాపర్!

పదో తరగతి పరీక్షా ఫలితాల్లో రత్నం స్కూలు విద్యార్థి రాష్ట్రస్థాయిలో టాపర్‌గా నిలిచి రికార్డు సృష్టించాడు. హరనాథపురంలోని రత్నం హైస్కూల్‌లో చదివిన పి.వెంకటసాయి 600 మార్కులకు 595 మార్కులు సాధించి రాష్ట్రస్థాయిలో ప్రథమునిగా నిలిచాడు. ఇదే బ్రాంచి విద్యార్థి అబ్దుల్‌గఫూర్ 590 మార్కులు, పిడతాపోలూరు బ్రాంచి విద్యార్థి వినయ్‌చౌదరి 584 మార్కులు సాధించారు. రత్నం విద్యాసంస్థల డైరెక్టర్ వేణుగోపాల్ 595 మార్కులు సాధించిన విద్యార్థి వెంకటసాయిని అభినందిస్తూ, ఈ మార్కులు రత్నం విద్యాసంస్థల చరిత్రలో ఒక మైలురాయిగా నిలిచిపోతాయన్నారు. విద్యార్థులకు ఎప్పటికప్పుడు చక్కని విద్యా బోధనను అందించడం వల్లే ఈ ఫలితాలు సాధించగలిగామన్నారు.

## రాఘవ టాలెంట్ స్కూల్‌లో స్టేట్ ర్యాంకర్లు!

ఈ యేదాది టెన్త్ పరీక్ష ఫలితాల్లో మరింత ఎత్తుకు ఎదిగింది ఉస్మాన్‌సాహెబ్‌పేటలోని రాఘవ టాలెంట్ స్కూల్. ఈ స్కూల్‌లో చదివిన ఎం.స్వర్ణశ్రీ 591 మార్కులతో రాష్ట్రస్థాయిలో 3వ ర్యాంకు సాధించగా, కె.మనోజ్‌కుమార్ 588 మార్కులతో 6వ స్థానాన్ని సాధించాడు. ఇక్కడే చదివిన పి.ప్రవల్లిక 578, బి.జ్యోతి 572, డి.హేమ 566, వి.అఖిలేష్ 564 మార్కులు సాధించారు. పదవ తరగతి పరీక్షలకు హాజరైన విద్యార్థులంతా అత్యధిక మార్కులు సాధించడంతోపాటు అందరూ ఉత్తీర్ణులవడం రాఘవ టాలెంట్ స్కూల్ ప్రత్యేకతగా చెప్పొచ్చు.

## రవీంద్రభారతి విద్యార్థుల ప్రతిభ!

రమేష్‌రెడ్డినగర్‌లో గల రవీంద్రభారతి స్కూలు విద్యార్థులు పదవ తరగతి పరీక్షా ఫలితాల్లో మెరుగైన ఫలితాలు సాధించారు. కె.సాయిశ్వేత 580 మార్కులు సాధించగా, జి.వరుణ్‌తేజ 578, వి.చందన 575, సాయితేజ 575, కార్మెన్ 573 మార్కులు పొందారు. స్కూల్‌లో చదివిన 18 మంది విద్యార్థులు 575 మార్కులపైన తెచ్చుకొన్నారని, ఎ1 గ్రేడ్ 312 మందికి, ఎ2 గ్రేడ్ 991 మందికి, బి1 గ్రేడ్ 310 మందికి, బి2 గ్రేడ్ 137 మందికి వచ్చినట్లు కరస్పాండెంట్ ఎం.ఎస్.మణి తెలిపారు.

## ఎస్ఆర్‌కెలో అద్భుత ఫలితాలు

మాగుంట లేఅవుట్‌లోని ఎస్ఆర్‌కె పాఠశాల విద్యార్థులు ప్రతి ఏడాదిలాగానే ఈ సంవత్సరం పదో తరగతి ఫలితాల్లో చక్కని ప్రతిభ కనపరిచారు. సుస్మిత 583 మార్కులు సాధించి స్కూలు ఫస్ట్ వచ్చింది. పలువురు విద్యార్థులు అత్యధిక మార్కులు సాధించినట్లు కరస్పాండెంట్ కృష్ణమూర్తి చెప్పారు.

## మైథిలిలో మంచి ఫలితాలు!

పదవ తరగతి పరీక్షల్లో మైథిలి స్కూలు విద్యార్థులు ఉత్తమ ఫలితాలను సాధించారు. టి.పావని 579, పి.రాజేష్ 572, కామాక్షి 571 మార్కులతో ప్రథమ, ద్వితీయ, తృతీయ స్థానాలను పొందినట్లు కరస్పాండెంట్ మైథిలి మనోహర్‌రెడ్డి చెప్పారు. 23 మందికి పైగా విద్యార్థులు 500 మార్కులు సాధించారన్నారు.

## శిల్ప విద్యార్థుల ప్రభంజనం

శిల్ప ఇంగ్లీషు మీడియం స్కూలు విద్యార్థులు పదవ తరగతి పరీక్ష ఫలితాల్లో మంచి ఫలితాలను సాధించారు. ఎన్.మురళీకృష్ణారెడ్డి 578, పి.హేమంత్ రెడ్డి 577, రజిత 576, వినీల 569, మురళి 566, జాయ్ 566 మార్కులు పొందారు. వీరితోపాటు 37 మంది 500 లకు పైగా మార్కులు సాధించారని కరస్పాండెంట్ వై.మల్లిఖార్జునరెడ్డి తెలిపారు. మ్యాథ్స్‌లో పది మంది, సైన్స్‌లో ఇద్దరు, సోషల్‌లో ఒకరు వందకు వంద మార్కులు తెచ్చుకొన్నారన్నారు.

## సాయి విద్యానికేతన్ ఘనత!

మినీబైపాస్ రోడ్డులో గల సాయి విద్యానికేతన్ విద్యార్థులు తమదైన ప్రతిభను ప్రదర్శించి పదవ తరగతి ఫలితాల్లో మంచి మార్కులు సాధించినట్లు కరస్పాండెంట్ పద్మావతి చౌదరి తెలిపారు. స్కూల్‌లో చదివిన పి.జితేంద్ర 586, వంశీకృష్ణ 579, దత్తాత్రేయ 571 మార్కులు సాధించి ప్రథమ, ద్వితీయ, తృతీయ స్థానాలను సాధించారన్నారు. 550కు పైగా మార్కులు 18 మంది పొందగా లెక్కల్లో నూటికి నూరు మార్కులు 25 మందికి, సైన్స్ ఆరు మంది సాధించారు.

## నేతాజీ పైలట్ స్కూల్‌లో మెరుగైన ఫలితాలు

పదవ తరగతి పరీక్షా ఫలితాల్లో నేతాజీ పైలట్ స్కూలు విద్యార్థులు మెరుగైన ఫలితాలు సాధించారు. మౌనిక 570, కల్పన 566, శ్వేత 564, సుజన 564 మార్కులు సాధించినట్లు పాఠశాల కరస్పాండెంట్ ఎం.వి.సుబ్బారెడ్డి చెప్పారు.

## వేదవ్యాస విద్యార్థుల ఘనత!

వేదవ్యాస స్కూలు విద్యార్థులు పదవ తరగతి పరీక్ష ఫలితాల్లో చక్కని ప్రతిభ చూపారు. ఎస్.పవనేశ్వరకుమార్ 573 మార్కులు సాధించి స్కూల్ టాపర్‌గా నిలిచాడు. ఎనిమిది మంది విద్యార్థులు 550కు పైగా మార్కులు, 20 మంది విద్యార్థులు 500లకు పైగా మార్కులు పొందారని స్కూలు కరస్పాండెంట్ ఎ.పి.బాలాజీ తెలిపారు.

## విజయ కృష్ణ హైస్కూల్ విజయ భేరి!

నెల్లూరు మూలాపేటలోని విజయ కృష్ణ హైస్కూల్ విద్యార్థులు పదవ తరగతి పరీక్షా ఫలితాల్లో విజయభేరి మోగించారు. ఇక్కడ చదివిన ఎం.ప్రేమ్‌చంద్ యాదవ్ 569, కె.విజయ 565, జి.మురళీకృష్ణ 561 వంటి అత్యుత్తమ మార్కులు సాధించారు. సాధారణ ఫీజులు, సాధారణ విద్యార్థులు, అసాధారణ ఫలితాలు విజయకృష్ణకే సాధ్యమంటున్నారు స్కూల్ కరస్పాండెంట్ విజయ నిర్మల.

## నారాయణ ప్రభంజనం

పదవ తరగతి పరీక్షా ఫలితాల్లోనూ నారాయణ విద్యాసంస్థల విద్యార్థులు తమకు తిరుగులేదని చాటి చెప్పారు. ఇ-టెక్నో స్కూల్ నుంచి పరీక్షలకు హాజరైన పి.అభిజ్ఞ 585, పి.విజితశ్రీ 583, ఎస్.కావ్యప్రణవి 582, మహేష్ శ్రీనివాస్ 581, కిరణ్మయి 581, లక్ష్మీదుర్గ 580, నిఖిల్ 580 మార్కులు సాధించారని నారాయణ విద్యా సంస్థల జనరల్ మేనేజర్ విజయభాస్కర్‌రెడ్డి చెప్పారు.

## సత్యసాయి కాన్సెప్ట్ స్కూల్ ఘనత!

స్థాపించిన కొద్దికాలానికే సత్యసాయి కాన్సెప్ట్ స్కూల్ విద్యార్థులు పదవ తరగతి ఫలితాల్లో మెరుగ్గా రాణించారు. పాఠశాలలో చదివిన ఎం.జీవనసాయి 577 మార్కులు సాధించాడు. జె.వెంకటేష్ 566, శివ ప్రియాంక 554 మార్కులు సాధించారు. పరీక్షకు హాజరైన వారిలో 20 మందికి పైగా 500లకు పైగా మార్కులు సాధించారని పాఠశాల కరస్పాండెంట్ చామకూరు హరగోపాల్ తెలిపారు.

## విబిఆర్ విజయభేరి

పదవ తరగతి పరీక్షా ఫలితాల్లో ధనలక్ష్మీపురంలోని విబిఆర్ రెసిడెన్షియల్ హైస్కూల్ విద్యార్థులు విజయభేరి మ్రోగించారు. పరీక్షకు 127 మంది విద్యార్థులు హాజరుకాగా 125 మంది ఫస్ట్‌క్లాసులో రికార్డ్ రిజల్ట్స్ సాధించారు. షేక్ మొహసినా 576, పి.చందన్ 574 మార్కులు సాధించారు. 28 మంది విద్యార్థులు 550 లకు పైగా మార్కులు, 81 మంది 500 లకు పైగా మార్కులు పొందారు. లెక్కల్లో 31 మంది విద్యార్థులు నూటికి నూరు శాతం మార్కులు సాధించినట్లు స్కూల్ ఛైర్మన్ ఊటుకూరు బ్రహ్మారెడ్డి చెప్పారు.

## శాంతినికేతన్‌లో సంచలనం!

నెల్లూరు మిలటరీ కాలనీలోని శాంతినికేతన్ హైస్కూల్ విద్యార్థులు పదవ తరగతి పరీక్షల్లో మెరుగైన ఫలితాలు సాధించారు. స్కూల్ విద్యార్థులు రాహుల్, ఫర్హీనా 573 మార్కులు సాధించారు. కార్తీక్ 565, మృదుల 564, వివేకానంద 563, పూర్ణ 560, సమీర 556, ఊర్మిళ 556, జైరాం 553, కోమలి 550 మార్కులు సాధించారు. ఎప్పటి మాదిరిగానే ఈ యేదాది కూడా సోషల్ స్టడీస్‌లో 22 మంది 99 మార్కులు, సైన్స్‌లో 22 మంది 99 మార్కులు, లెక్కల్లో 22 మంది నూటికి నూరు మార్కులు సాధించారు.

## సంఘమిత్రలో మార్కుల మోత!

నెల్లూరు భక్తవత్సలనగర్‌లోని సంఘమిత్ర విద్యాలయం విద్యార్థులు పదవ తరగతి పరీక్షల్లో మెరుగైన ఫలితాలు సాధించారు. బి.రాజశేఖర్ 577, ఐ.వినీల 570, ఎం.లిఖిత 560, ఐ.వెన్నెల 555, ఎన్.యశ్వంత్ 552, బి.గాయత్రి 550 మార్కులు సాధించారు. పరీక్షకు హాజరైన వారిలో 550కి పైగా మార్కులు ఆరు మందికి, 500లకు పైగా మార్కులు 19 మంది సాధించారు.

## న్యూ నేతాజి జడ్ఎస్ఆర్ విద్యార్థులు

నెల్లూరు జేమ్స్‌గార్డెన్‌లోని న్యూ నేతాజి టాలెంట్ స్కూల్ విద్యార్థులు పదవ తరగతి పరీక్ష ఫలితాల్లో తమ సత్తాచాటారు. ఇక్కడ చదివిన జడ్.రాజశేఖర్‌రెడ్డి 556, కె.శ్రీధర్‌రెడ్డి 541, జి.రమేష్ 531 మార్కులు సాధించి ప్రథమ, ద్వితీయ, తృతీయ స్థానాల్లో నిలిచారు. ఇక్కడే చదివిన ఎనిమిది మంది విద్యార్థులు 560కి పైగా మార్కులు, 500లకు పైగా మార్కులు 100 మంది సాధించారని వీరిలో మ్యాథ్స్, సైన్స్, సోషల్‌లో నూటికి నూరు మార్కులు సాధించినవారు ఎక్కువని స్కూల్ కరస్పాండెంట్ జడ్.శ్రీనివాసులురెడ్డి చెప్పారు.

# ద్వితీయ వర్ధంతి
03-06-2011



## డాక్టర్ ఎర్రంరెడ్డి ప్రసాద్‌రెడ్డి MDS

దివంగత మేనేజింగ్ డైరక్టర్, అపోలో డెంటల్ హాస్పిటల్స్

అందరినీ ఆప్యాయతతో పలుకరించే మనసున్న మంచి వ్యక్తి, "కష్టేఫలి" అని నిరూపించి మా అందరి హృదయాలలో చెరగని ముద్రవేసిన మా 'ప్రసాద్' లేని లోటు తీరనిది. నీ జ్ఞాపకాలు, తీపి గుర్తులు మా హృదయ ఫలకాలపై చిరస్థాయిగా వుంటాయి.

**ద్వితీయ వర్ధంతి సందర్భంగా స్మరించుకొంటూ...**

అత్త - మామ
పద్మావతమ్మ
డాక్టర్ జి.కొండారెడ్డి

బావమరిది
డాక్టర్ జి.మదన్‌మోహన్‌రెడ్డి
డాక్టర్ జి.దివ్యారెడ్డి

భార్య - ఎర్రంరెడ్డి మమత

కుమారుడు - ఎర్రంరెడ్డి సాయిఅన్వేష్

డాక్టర్ కొండారెడ్డి దంత వైద్యశాల
శంకరాగ్రహారం, నెల్లూరు. ఫోన్ - 2327235

మరియు డాక్టర్లు, సిబ్బంది

Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore.